శ్రీ

# హరిశ్చంద్రచరిత్రము.

## ప్రథమ భాగము.

ఈ వచనకావ్యము

నిడమర్తి జలదుర్గాప్రసాదరాయ

విరచితము.

మూడవ కూర్పు.

రాజమహేంద్రవరము

శ్రీ విద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1919



*Title Page Printed at the S. K. P. Works, Rajahmundry.*

## FREFACE TO THE SECOND & THIRD EDITIONS



A portion of this work was prescribed as a text for the Matriculation Examination, by the Madras University. Having been thus a recognized text book, this edition has been issued, as it may prove serviceable as a text for use in secondary Schools.

## Preface to the First Edition



The aim of this little volume is to place before the reader, a type of moral excellence, which he may imitate with great advantage The Hero of this Prose is Harischandra, a very celebrated Hindu King, whose name has now passed into a proverb According to the Hindus he is the very soul of truthfulness The influence of such a hero can never fail in impressing upon the mind of the reader the great truth that a virtuous man will in the end have his reward, though it may be held back for a time. Several other virtues are also illustrated in the story of this great King, which the student may take "by living assimilation into his living organism."

In the treatment of the subject, some changes of very little importance have been made, of which only two deserve some notice First. The story according to the former writers on the subject, to whom I have access, begins with Harischandra, and then the scene shifts to Heaven where in the presence of

Indra, a great controversy takes place between Vasishta and Viswamitra, as regards the virtuous disposition of Harischandra The result of the controversy is that Viswamitra begins to test the truthfulness of Harischandra by subjecting him to many calamities This I think, is more of the nature of a drama than of a narrative. Two different actions appear to be predominant, and the interest of the plot is annihilated by letting the reader know in the very beginning, why Viswamitra was troubling Harischandra So I intend to introduce the controversy in Heaven, in the latter part of the work, by way of an episode, thus making it subordinate to the main plot.

Second At the end of this part, a new incident is found On his way home, after promising over the kingdom to Viswamitra, Harischandra meets one in the disguise of his father, who tempts him to speak lies, pleading it no sin to lie for one's own safety Against this Harichandra stands proof This incident is introduced for the sake of variety, as well as for the purpose of showing how far above all temptation is the moral courage of the Hero

I have this time published only the first part of the work, and I hope I can ere long publish the rest by the grace of God

Rajahmundry, }
Innespeta. } **N. Jaladurgaprasadarayadu**

# హరిశ్చంద్రచరిత్రము

## ప్రథమ భాగము.

### ఇష్టదేవతాప్రార్థనము.

ఉ. శ్రీయుతసర్వలోక వరసేవకలోక చకోరవార చం
ద్రా! యువతీచాయలోల నయనాంచిత చంచలచంచరీక ప
ద్మా! యుతసుందరానన! నతావనతత్పర మానసాబ్జ శ్రీ
దా! యిలనిశ్శ్యామలాంబకము నిమ్ముగ నొంతుమదంబ నెంతయున్.

ఉ. శ్రీకరకాండఘోరమున దృప్త దశాస్య ముఖాంబుజంబులం
దాక్రి చెడంగఁజేసి విబుధావళి భూజనులొందుతాపముల్
పోకడవెట్టితీవు నిను భూషణసేయఁ దరంబె రామచం
ద్రా! కరుణాకరా కరుణ రంజిలఁగావవె వేంకటేశ్వరా.

చ. అనిశము నుట్టియుండు నమగాళి లసన్మహిళాసమావృతా
ర్జునరుచిరాంగముం గలిగి రోదసి నిండి జటాకిసాలము
న్వినయుతము న్సుధాకర కనత్సుమమా హర పారిజాతమిం
పెనయఁగ మాకు నిచ్చెడు మభీష్టఫలంబుల నెల్లకాలమున్.

చ. సకలకళావిలాసయగు శారద నీరద వేణిమోహనం
జకచకచిత్ర నాట్యమును సల్పుచునుండఁగ వేదవాక్యస
న్నికరముఁ బల్కి లోకముల నేతనుఁ దెల్పి జగాలు మేలుగా
నకలుషవృత్తిఁ ద్రిప్పఁగ హాళిని జేయుఁ జందలంచెదన్.

చ. ఘనవనజాక్షి యార్ష్యఁటు కౌస్తుభమున్ భవదీయ పాదకాం
తినిఁ బురుడించెనంచు పదతీవ్రహతిం గనఁజేయునా నెపీ
కనహాఁ జూచి శంఖమునకాకృతిఁ గాంచఁగ దాఁచఁ బూని
వనయుము మొఱ్ఱవెట్టునటు లక్కటికంబును వీడి చేయుటో
ష్ఠము గదయంచు నవ్వఁ జనుపొఁడపిరుల్గుల్లి ప్రోచెడిన్

శా. కామున్ గాల్చినవానిఁ గామునలఁజిక్కంజేసి యుద్వాహమై
సామైనాథుని దేహమందున నిజేష్టంబుం దగంజేసినా
భీమున్ లోఁగొని యార్యయై సకలముం బ్రేమంబునం బ్రోచునా
రామారత్నము గౌరి మమ్ము దయతో రక్షించుఁగా నెప్పుడున్.

ఉ. సంతత మంతరంగ మతిసాంద్రదయారసమై వెలుంగ నా
వంతయువంత లేక మదివర్ధిత మోదమనంత మొందఁగాఁ
జెంతనుఁ జేరి కొల్చు శుకసేవకుఁ గాచుచు వంశభాస్వరా
నంతకృతిం దగం జదువ నంబుజగర్భుని రాణిఁ గొల్చెదన్.

చ. అలహరిణాంకుఁ దండ్రి శిరమందలి గంగ నెసంగు భృంగసం
ఘలలితపుండరీకమని గ్రక్కునఁ దొండము సాచి పట్టఁబోఁ
దొలిపగ నంచి రాపిడిని దోడనె సేయఁగఁ బూనె నంచుఁ దాఁ

దెలిపి శశింజటాఘనతతిఁ గనకుండ శివుండుదాచఁగాఁ
వ్రాలఁగువినాయకుండుదయతోఁ దొలగించెనుఁగాకవిఘ్నముల్

మ. పౌనరంగోల్తు నుమాపతిప్రియశిరోభూషుం దయాంభోనిధి
ర్ధనశీలుం ఘనదానకృత్యరిపుజు నాప్రమాంగుఁ దేజోనిధిం
దనివిన్నుత్రకళామృతుంగువలయా ప్తప్రాభవుల్సీతలే
క్షణునిన్మద్గురుచంద్రు భీకరతమఃకాండాపహారుంగదుఁ.

క. తలఁతున్వాల్మీకివ్యా
సులశ్రీహర్ష భవభూతి చోర మయూరా
ఖ్య దండి కాళిదాసా
దులసత్సంస్కృత కవీశతిలకులఁ బ్రీతిన్.

మ. సరసంబొప్పఁగనాంధ్రభాషఁ గవితాచాతుర్యముంజూపి యా
ధరఁబేర్కొందిన తిక్కనాదికవి ముఖ్యాళులనాత్మనసాం
బుర్హుహంబందునవిల్పి నేసతతముం బూజింతునానాపదో
త్కరసూనంబులనేరి సారమునెఱుంగం గీటసామ్యంబునన్.

తే. గీ. గారనాచమాత్యుఁబాగడి శంకరుని నినుతిఁ
జేసి కంచిశరభయాఖ్యు సేవపలిపె
శర్వకోపాపహారమును సకలధర్మ
రత్ననిధియు నై యంబుధి ప్రిభఁజెలంగ.

క. తవిలి హరిశ్చంద్రధరా
ధిపుని సచ్చరిత్రమే నధిక ముదమలరం

గ వచనకావ్యముగాఁజే
సి వనజనేత్రునకు మేఘజిద్ఘాతునకున్,

క. అంకిత మొనరింతునుమీ
నాంకాకారునకు సుందరాంగ శ్రీవ
త్సాంకునకుఁ బూర్ణిమా హరి
ణాంకాపహసదకలంక యశునకు భక్తిన్.

క. దీనిం బాగుగఁ జదువఁగ
నానందమమంద సౌఖ్యమందుచు సత్యం
బూని యహీనశయానున
నూనదయ సమృద్ధిబొందుచుందురు జనముల్.

ఉ. చాలఁగ శాస్త్రజాలములఁ జాలనెఱుంగను జ్ఞానమెంతయుఁ
బోలఁగ లేదు కావ్యవరముల్చదువంగను నేరనైతి శ్రీ
లోలునిమీఁద భారమును లోఁగకయుంచుచు దీనిఁ బూనితిన్
బాలుఁడ నాయెఱుంగమిని బండితులార క్షమింపవేఁడెదన్.

శ్రీకరభాస్కరకులనీ
రాకరరాకా సుధాకరా క్రూరసురా
నీకారాతిధరాధర
భీకర శతధారధీర భీమాకారా.

దేవా ! యవధారు

శ్రీమత్పరమహంస నివాసంబయి శుకపికముఖసకల శకుంతసంతానావనపారిజాతతుల్యరసాజాతంబగు ద్వైతంబను వనంబు భువనపేటికం జెక్కిన యింద్రనీలవిభూషణంబన భాసిలుచుండు. ఆవనంబునవికసితారవిందమరందసుగంధసమాకర్షితమధుకరపాళిమనోహరంబగు హ్రదం బొండుగలదు. తత్తీరంబునంజేరిన వారివిహంగమపుంగవబృందంబుచే నందంబగు మాకందం బొక్కటి చెన్నొందు. ఆవృక్షంబుసచ్ఛాయ శరణ్యావాసంబు సేయ వచ్చిన పాండవాగ్రజన్ముం డనుజన్మసతీసమేతంబుగఁ దా నడవులంబడెడి చెకుగులఁ దలంచి ఖేదంబునఁ గొందలంబు నొందుచుండ నాసమయంబున నిజతపస్సామర్థ్యవినిందితసనందనుండగు మృకండునందనుం డేతెంచి యజాతశత్రుచేఁ బూజితుండయి యర్ఘ్యాసనంబునం గూర్చుండి యిట్లనియె. పాండవోత్తమా ! నీమొగంబుఁ జూడ నేదియో విచారంబు నొందుచుంటి వని తోఁచెడిని. నేను నీమనోవేదనాపనోదనంబు సేయఁ జాలకున్నను శోకంబునఁ దమ దుఃఖంబులు మిత్రులకుం జెప్పిన జనంబుల విచారంబు గొంత

యడంగుఁ గాదె. కావున నది చెప్పనగు నేనిం జెప్పుమని యడి
గిన మునికులతిలకునకుం గుంతీతనయుం డిట్లనియె. మునిరాజ
శేఖరా! సన్మార్గప్రవర్తనశిరోమణివయి సర్వేశ్వరుఁబోలు
నీదుచరణంబుల స్మరించిన మాత్రంబున సకలకలుషంబులు
ఖిలంబులగుచున్న దేవరసందర్శనంబున నవి వాయువశంబునఁ
దూలంబులట్లు పాఱుట కేమిసందియంబు? నాభాగ్యవశంబు
నం జేసి మిమ్ముం బొడగంటిఁ గృతార్థుండ నయితి. నాయదృ
ష్టం బింతింతని చెప్ప నగునే. మీదర్శనంబునన మదీయతా
పంబు లడంగె నయినం దాసుని విన్నపంబొక్కటి యాలకిం
పుము. చతుస్సముద్రముద్రిత ధరణీతలం బఖిలభూనాయక
కోటీరకోటిసంఘటితనీలమణిఘృణిప్రవాహప్రభాసురారుణ చర-
ణుండనయి యనంతవైభవంబున నేలు నేను నేఁడు దాయ
చే జూదంబున నోడి బంధువులం గూడి యడవికి వెడలివచ్చి
పడరాని పాటులెల్లం బడుచు నీరీతిం దనుయాత్ర జరుపు
చుంటిని. పుట్టినదాది యేమియుఁ గష్టంబు లెఱుంగనివారు
గూడ నినుముంగూడిన యగ్గి సమ్మెట పెట్లం గోల నాఘూ
లంబున నెన్నియేని వేదనలం బడుచుండిరి. విలువిద్య ద్రోణా
చార్యునకు సఖుండగు పాంచాలునంతవానికిం గాదిలికూఁతు
రయి విమతరాజన్యగర్వపర్వాపణధూర్వహుండగు ధృష్ట
ద్యుమ్నునకు ముద్దుఁజెలియలయి యఖండభూమండలమండ
నాయమానయశఃపూర్ణుండగు పాండుభూవరునకుం గోడలయిన
యాగర్భశ్రీమంతురాలీ పాంచాలి నేల నీలీల విషమారణ్యం

బుల్ కంటకమధ్యంబున నడచుచుం బడెడు బాధలం జూచిన
మనంబు దహింపకున్నె. శిరీషకుసుమసుకుమార శరీరులగు
మాదేవియులవిధంబుఁ గన్న హృదయపద్మంబు నూఱు వ్ర
క్కలు గాదే. హంసతూలికాతల్పంబున సౌఖ్యంబున శయనిం
చు నింద్రసూనుఁ డీకాలంబున నుత్తరీయం బాస్తరణంబుగాఁ
బండఱాసి నిద్రించుచున్నఁ జూడ మనం బెట్లు లోప్పు. సర్వ
లోకభీకరంబగుసంగ్రామంబున వేదండకరండంబు భేదిల్ల
సింహనాదంబు సేయుచు శత్రుకుండాలశుండాపరిఖండకాం
డ విఖండనోద్దండగదాదండుండగుచు గండుమీఱు భీమసేనుం
డరులచేఁ బరాజితుండయి కోఱలువెఱికిన పాఁపతేఁ మాదిరి
దుఃఖసముద్రంబున మునిఁగియున్న నీతనిఁ జూడ నెట్లోపుదు.
మ్మమ్మందఱం బిన్నటినాఁటనుండియుఁ దల్లియుం దండ్రియుఁ
దానయై గోమునం బెంచిన యాలోకమాత కుంతిభోజా
త్మజాత ఖిన్నాత్మయయి యుండ నామనంబు నిర్మలంబుగా
నెట్లుండు. ఓసకల లోకపావనీ! మమ్ముంగని సౌఖ్యంబు లందు
టకు నోఁచుగా మాకొఱకు దుఃఖంబు ననుభవించుచుంటివే.
మమ్ముంగనకున్న నీకిట్టిదుర్దశ ప్రాప్తంబు గాదుగదా మా
మీయభాగ్యుల నేటికిం గంటివమ్మ యని పట్టరాని దుఃఖంబు
నం బ్రలాపించు నప్పాండవేయుం గని మార్కండేయుం డిట్ల
నియె. భూపాలా! యేలవగచెదు. దైవికంబునకు విచారించి
పనియేమి. ఈభూవలయంబున నెవ్వరయిన విధికృతంబు నతిక్ర
మింపఁ జాలిరె. ఇంద్రాది బృందారకసన్నుతుండయి చతు

ర్దశభువనవ్యాప్త యశోవిమలుండగు నలుం డొక్కరుండ యఖిలరాజ్యంబుం గోలుపోయి కానవంబులం గష్టంబు నందండే. సప్తవ్యసనంబులలో నొక్కటి యగు ద్యూతంబుచే నట్టిబాధ కగ్గంబయ్యె నతనిం దడవ నేల పూర్వంబు పావనంబగు సూర్యవంశంబునం జనించి దేవేంద్రసమానత వెలసిన హరిశ్చంద్రధరాకళత్రుండు సత్యవాఙ్నియమంబునం నింతింతనరాని క్లేశంబునకు భాజనంబు గాండే. అది యంతయుం బురాకృతకృతపరిపాకఫలంబుగాక వేఱొండు గాదు. అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభ మ్మనుమాట బూటకం బగునే. కావున నీవు దుఃఖింప లవంబును నవసరంబు లేదు. నావుడు ధర్మజుండు మహాత్మా! భవద్వాక్యంబుల నామనఃకలంకంబుదేరె నయిన మహానుభావులగు మానవేంద్రుల చారిత్రంబులు విన్నదురితంబులు దూరంబు లగునని మీవంటి పెద్దల వలనవిందుఁగాన నా కానాకాధీశసంకాశు సచ్చారిత్రంబు ససాకల్యంబుగాం జెప్పి ధన్యునిం జేయవే యని వేఁడిన నాముని కుంజరుం డిట్లని చెప్పం దొడంగె.

శ్రీ

# హరిశ్చంద్రచరిత్రము

## ప్రథమభాగము.

సరయూసరిత్తటంబున నితాంతలతాంతసంతానాసంతానజరాజబృంద సుందరనందనా యాతవాతపోత సంభృత సౌరభసంతోషిత సుమనోనికేతంబగు సాకేతంబను నగరంబమరావతిం బురడించుచు భరతఖండంబునకుమండనంబయి యొప్పుచుండు. ఆపురంబు జనులందరుం బురందరునేల్బడి నాకలోకవాసులబలె వశీకృతధృతచంద్రుండగు హరిశ్చంద్రుండనునరేంద్రుని పాలనంబునఁ జాల మనంబుల నానందంబు నొందుచుందురు. ఆరాజేంద్రుండు శచీదేవిం బోలె సౌందర్యవతి యగు చంద్రమతియను చంద్రాననం బరిణయంబయి పూవుందావియుం బోలెఁ దాను నమ్మానవతియుఁ గలసి మెలంగుచుండెను. అతనికి బుద్ధిబలంబున బృందారకగురునిం దూరు సత్యకీర్తి యను సచివోత్తముం డాలోచనంబులం జెప్పుచుఁ గంటికి ఱెప్పవోలె ననవరత మాపజలం బొరయకుండఁ గాచుచుండు. అట్లాతని మంత్రిలో

వనంబుల గ్రహించుచు హరిశ్చంద్రుండు పౌరు లందరి రాజ
పురందరుండు మనల వేయుగన్నులం జూచు నీతండు చిరా
యువగుం గాక యని దీవింప దివ్యప్రజాపాలనంబు సేయు
చుండె. అట్టుండ నొక్కనాఁడు కుంభినీధవుండు ప్రధానిం
గని యిట్లనియె. అమాత్యశేఖరా భవదీయమనీషావిశే
షంబున దోషంబులం దొలంగి యశేషసౌఖ్యములం బొందు
చుంటిని. ఎన్నియైశ్వర్యంబు లున్నను బుత్రహీనుని జన్మంబు
నిరర్థకంబు. వానికిఁ బున్నామనరకప్రాప్తి తప్పదు గదా.
వానిమానసము దీపికావిరహితంబయిన యాలయం బట్లు
తమోమయంబయి యుండు. అట్టివాఁడు కింశుక కుసుమంబు
చందంబున నామోదంబు లేక లోకనింద నొందుఁగాన నే.
నాసడికిఁ బాలు గాకుండ సర్వలోకపాలకుం గూర్చి తపంబు
సేసి బాలకు నొక్కనిం గని యానందంబున మిన్నందుదును.
రాజకీయవ్యవహారంబుల మనంబుఁజొరనిచ్చిన దదేకనిష్ఠ
గా నుండఁ గష్టంబగుఁగానఁ గొన్నిదినంబు లీరాజ్యభా
రంబు తావక బాహువులఁ బూని ప్రజాశోషణంబు లేకుండఁ
బోషింపుచుండుము. నీయట్టి మంత్రరత్నంబున్న నామనో
రథంబు లీడేరకున్నె యని రాజ్యం బాతని కొప్పగించి తత్‌క్ష
ణంబున నిర్జనప్రదేశంబున కేగి ఘోరనిష్ఠం బూని యానక
దుందుభినందనపాదారవిందధ్యానపరాయణహృదయుండయి
తపంబు సేయ నచిరకాలంబున లక్ష్మీశ్వరుండు నీలకాయం
బునఁ గాంచనచేలంబు నీరదంబునడంబుమీఱు క్రొక్కాఱు

మెఱుంగుఁ బోల భక్తవత్సలుండయి ప్రత్యక్షంబయి నీభక్తిని మెచ్చితి నాదయారసంబున నీమనోభీప్సితక్షేత్రఫలప్రాప్తియగు సంతానంబునం బొందుము. పౌరప్రజలం గరుణతోడఁ బాలింపుము. నీకు సర్వశ్రేయంబులు సమకూరుఁగాక యని యంతర్ధానంబు సేసె. హరిశ్చంద్రుండును బురంబునకు వచ్చి యవ్వార్త నిజసచివప్రముఖముఖ్యులకుం జెప్పి ధర్మనిరతబుద్ధి గులధర్మంబు విడువక యుండె. అంతం దనమనోహరయగు చంద్రమతీమత్తకాశినీమతల్లిక గర్భంబుఁ దాల్చి నవమాసంబులు నిండ నిండుచందురుఁ గాంతి విడంబించి జయంతు నందనంబున మీరు సుకుమారాకారుఁ గుమారు నొక్కని గనె. అప్పుడు బృందారక బృందంబులు దానందంబుఁ బొందు డెందంబులతో నిష్యందమరందతుందిలమందాకినీరచిత నందదిందిందిరసందోహ గీతారవంబు మీఱ దుందుభివ్రాత ధింధిమిధ్వానంబుల నాకాశంబు బీటలువాఱ నాట్యంబులు పుచ్చు కుసుమవర్షంబు గురిసిరి. అట్టి శుభమూహూర్తంబున జనియించి శంఖచక్రకలశచ్ఛత్త్రాదిశుభలక్షణలక్షితుండయి దీపించు నబ్బాలేందుముఖునకు వసిష్ఠాదిమహామునుల యాశీర్వాదంబులు సముద్రఘోషంబునఁ జెలంగ లోహితాస్యుఁడను నామంబిడి జననీజనకు లపారసౌఖ్యపారావారంబునఁ దేలుచుండిరి.

అట్లు కతిపయవత్సరంబులు గడచిన యనంతరంబు పల్లవితరసాలసాలకిసాల బృందనందితకోకిలాలాపకాంతిం

బగు వసంతం బంతికగతం బగుటయు నాభూవిభుండు ఘన యత్నంబు సేసి రాజసూయాదివివిధ మహాధ్వరంబు లతుల తపోగరిష్ఠుండగు వసిష్ఠుం డుపద్రష్టగా నిర్వర్తించి యాచక కల్పకంబయి యొప్పె. అదియంతయు విని వెదుకఁబోవు నోషధి దైవయోగంబునఁ గాళ్లఁ దగులుకొనె నని సంత సించి కెండవవిష్ణుపుత్రుం డనం దగు విశ్వామిత్రుం డరిజ నాయోధ్య యగు నయోధ్యకుం జని నిజాగమనవార్తఁ బంపిన నారా జెదురేగి యర్ఘ్యపాద్యాదు లొసంగి తోడి తెచ్చి యమ్మునిసింహు నవరత్నమయసింహాసనాసీనుం జేసి యిట్లనియె మునిచంద్రమా! దురితతమోపహృతంబయి సంకోచించిన మన్మనఃపద్మంబు భవదాగమనంబునం దమో విరహితంబయి వికాసభాసురం బగుచు నిర్మలంబయినో యది. మునుల కెందయిన నసాధ్యంబులు గలవే. అది యును గాక సర్వప్రపంచజన్మకారణుండగు పద్మసంభవుఁ జీరకిం గొనక ప్రతిసృష్టి సేయఁ జాలి క్షత్త్రియవంశావతం సుండ వయ్యు బ్రహ్మర్షి వయి ప్రహర్షమున మించితివి. ఇట్టి నీమెదుట విఘ్నంబులు పటాపంచలయి పాఱుట కేమి యాశ్చర్యము అఖిలాగమస్వరూపులగు మీముఁబోంట్లదర్శ నంబు మహాభాగ్యవంతులకుఁ గాక యలంతులకు లభించు నెట్టు. తావకపాదపంకజపూజావిశేషంబున మదీయసద నంబు పావనం బయ్యె సకలరాజకోటిలోపలం బ్రశస్తిం గాంచితి. మీవాంఛితం బెయ్యది దెలుపుఁడిప్పుడ తీర్చెద, నావుడు నబ్భూరమణునకు మునివరుం డిట్లనియె. మహీపాల కా! నరాకారంబుఁ దాల్చిన పారిజాతంబవు గాక! నీవు రాజ

మాత్రుండవె. ఈభూచక్రంబునంగల చక్రాధిపతు లెవర
యిన నీకు సగవత్తురె. కల్పవృక్షంబుఁ జేరి కాయ లడుగు
చందంబున దానకళానిపుణుండవగు నిన్నొక్క యల్పదా
నంబు వేఁడవచ్చితి. దానిం జెప్పెద వినుము. చంద్రకళా
ధరునకుఁ బ్రియంబుగఁ గ్రతు వొక్కటిఁ జేయఁ బూనితి.
దాని నీవు సాంగంబుగా యథావిధిం జరుప వలయు. నా
మనోరథం బీడేర స్తంబేరమంబు మీఁద నరుం డెక్కి
యంబరంబునకు మాణిక్యం బెగరవేయ నది యెగిరినంత
పొడవు ప్రోవు వేయు ధనంబు గావలయు. ఇదియ నాకో
రిక యన నా రాజేను గృతార్థుండ నయితి. మీకాంక్షితం
బిప్పుడ తీర్చెద. స్వాపతేయంబుఁ గొనుఁడనవుడు గాధినం
దనుఁ డతనివితరణగుణంబున కత్యాశ్చర్యంబునొంది భూ
వల్లభు తోడ నిట్లనియె. రాజోత్తమా! నీ యట్టిదాతయుండ
మాకేమి కొఱంత. ఈధనంబు నాకు వచ్చిన యట్ల నీయొ
ద్దనె యుంచుము. వలసి నప్పుడు చేకొనియెద. సవనశాల
నిర్మింపఁగాఁ దావు వెదుక వలె నంతదనుక ధనం బేను
దాఁచెఁ గలనె. నీవ యీయుపకారంబుఁ గూడఁ జేయుము.
నీకు శుభంబగుఁ గాక పోయి వచ్చెద నని తత్క్షణంబు యా
మంత్రణంబు సేసి నిజాశ్రమంబునకు జనియె.

ఆతం డేఁగుటయుఁ గతిపయదినంబుల కాసంయ
మీంద్రునకుఁ దాఁ జేసిన వాగ్దానంబు మనంబునకు రా,
రా జీమునిరాజడిగిన ధనం బప్పుడ చేకొనక యక్కఱ
వచ్చు నప్పుడు వత్తుననియె. తత్క్షణంబ పుచ్చుకొన్న సుఖ-

బుగానుండు. అట్లుగాక యెప్పుడో వత్తునని యప్పు పయి నునిచి చనె. ఎట్టిసమయంబునఁ గావలయుననునో. కోపం బీతని ముక్కుననయుండు. ఇమ్మహర్షికిఁ గాతాళం బుదయింపకయ యుండవలయుం గాని యాగ్రహగ్రస్తమానసుండయిన నీతని కోపంబు వారింప వారిజగర్భున కయిన వశము గాదు. పాముతోఁ జెలగాటం బన్నట్లు లిట్టివాని చేతి లోనం జిక్కితి. దైవం బేమిసేయఁ దలంచెనో పాల ముంచిన నీట ముంచిన నాతనిదే భారము. దైవానుగ్రహంబు వలనం గాని మనచే నేమియగునని విచారించు చుండె.

అప్పు డప్పురుషరత్నంబునకు సచివోత్తముం డిట్లనియె. దేవా యినుం డధికపథపరిశ్రాంతి నపనయింప సముద్రస్నానంబు సేయుటకుఁ గా నరుగుచుఁ గందిన మేని యరుణకాంతు లంబరంబును బ్రసరింపం జేయుచు నంత కంతకుం జరమనీరాకరాంతరంబునకుఁ గరంబు రయంబున నేగ నా దృగ్గోచరుండు గాక మఱుంగు వడియె. పద్మినియు నాథదుస్సహవియోగవీచికాక్షరం బయో నే నెట్లు లీది పరరాజుమొగంబుఁ జూచుదాన నను కరణి నధీశ్వరుఁడు వోయిన జాడనె వీక్షణంబులం బఱపి పఱపి యంతం గాన ననువు పడక నేత్రారవిందంబు లల్లనల్లన మూయ నంధలి తారకాన్ని కాయంబనఁ గాయంబులు మఱచిన యాసవపానమత్తపుళిందబృందం బందుఁ జిక్కువడియె. ఖగంబు లాకాశంబున శ్రేణులం గట్టి కలకలనినాదంబు సేయుచు గూండ్లకుం బోవుచున్నవి. పశువులు శ్రవణానందంబుగా గొల్లపిల్ల లూదు

పిల్లల గోవ్రుల వినుచు నిల్లకుం బోయి గోష్ఠంబులం దమ రాక కెదురు సూచు చిన్నిముద్దుదూడ లంభా యని యఱవ నాకందువులం గనుట వలనఁ దమకుఁ గలిగిన సంతసంబు వెలికిఁ దోఁపఁ ద్రిరిగి యంభా యనుచు వానికోమల మృదు దేహంబుల నాకుచుం బాలం గుడుపుచున్నవి. చక్రవాక నికాయంబులు మిథునంబులం బాసి విరహతాపంబున వేఁగు చున్నవి. సంధ్యాసమయం బయ్యెనని యమాత్యుండు పలి కిన నదియు నొక యపశకునంబు గాఁ దలచియు విచారంబుఁ బయికిఁ దోఁపనీక యుచితకాలంబున సధ్యాదివిధులం జేయు వాఁడు గావున మేరుగిరి నుండి లేచు పంచాననంబు పోలె నా రాజపంచాననుండు దిగ్గున సింహాసనంబు నుండి లేచి పరి జనంబుం బోఁ బనిచి కాలకృత్యంబులఁ దీర్చి నంతఃపురం బున కరిగె. అంతం బాంధయూథంబుల బాధపఱచు వీనికి మాత్రమే మేలు సౌఖ్యంబు గలుగ వలెనని కనలున, మధు కరీమధుకరంబుల వెదకుచు సరోవరంబులచుట్టు దిరుగు తు మ్మెదలకుం దమసఖులు దగులుకొనిన యరవిందంబులు గానరాకుండఁ జేయు పొంటెనాఁ గటికి చీఁకటి యక్కటి కంబులేక కంటకంబులు గుటజంబులు గ్రామంబులు గ్రావం బులు నను భేదం బగపడకుండ బ్రహ్మాండంబు నిండె. అట్లు తమంబుచే నేమియుం దెలియక జడుల విధంబుననవి యా ర్తధ్వానంబు లంబరంబునం బఱపఁ దన్నుఁ బ్రార్థించుట గాఁ దెలిసి మనీయపరివారంబు నిటుగోరంబులం బెట్ట సమ

కట్టినయన్నియు మది మిప్పుడ యడంచెద వారలు మామక సేవకవర్గంబని యెంచుకయునం దలంపవలదె ఔరా వాని పోతరంబు దానిఫల మిప్పుడ యనుభవించెడిఁగాక'' యని క్రోధంబుమూర్తీభవించిన పోలిక లేచెనా నల నెల రాక సంయుతుండయి యుదయంబగుడుఁ దిమిరంబు గరంబుదరంబున దరంబు గదుర దురంబునకు వెఱచఱచి నలూపంచలయు కందరాంతరంబును వృక్షంబులు గృహంబులు లోనుగాఁగల యున్నతవస్తువుల నీడనుదాఁగె. అప్పుడు నాథునిసరసకరసంస్పర్శనంబునం జేసి యనురాగంబు వొదలి విలాసంబునొందెననఁ విరిసినకుముదిని కుసుమంబులం దక్కుటి లతాంతంబుల నలఘుతరమరందంబుఁగ్రోలి యళిపాళినిజబంధుపరివారంబు పాటుమఱచి యానందంబుబొందఁ గోపంబుదీరి బ్రసన్నహృదయుండయ్యెనానిందుండు స్వాభావిక ధవళరుచిం జెన్నొందె. అంతకునున్న మరమల్లికావల్లీ కాయమానవిరాజమాన సుమరాజిభంగి నింగింబ్రకాశించు దారకాగణంబు జీవితేశుసన్నిధిసత్యుద్దీర్ణంబుగ భాసిల్లెంజనదని యూతనిలోపలీనం బయ్యె ననంబు రాతిశిరోభూషణము తేజోభరంబున నణగియుండె. అట్లు సకలలోకమనోహరయయి వెలుఁగు నాజ్యోత్స్నవిభావరి విభావరీవరవిభావిభవసమన్వితంబగుజగంబునగంబులను జీవకోటులను గర్భంబునం దాల్చి నదుగ్ధకూపారంబుమాదిరి మీరె నందు వటపత్రశయనుం డయి శేషశయనుండున్న వడువున మృగాంకుండు-దేలుచు విహారంబు సలిపె. అప్పు

డమృత కర కరనికరంబులు సుధాలలిత సిత కుడ్యకాంతు
లను తమ బంధువులు గని సంతసంబున నాలింగనంబు సేసివిలా
సంబున భాసమానంబు లయ్యెనన భిత్తిభాగంబులం బర్వెన
చంద్రిక లరుణ కిరణంబు డపరధరాధర గహ్వరంబులకుం బా
ఱువన్నను డాఁచుకొనిన తేజంబుచే విరాజమానంబగు దీప
పాత్రప్రభలవలన నిబిడీ మెదుటిసీపంబుల కరణినుండియవి
రేసిన వెనుకఁ దమకాంతుల నయున చకోరకంబుల కపార
ముదంబు సంఘటింప నారాజకళత్రుండును గళత్రంబును
జిరత్నరత్నసగితవిశాల ధామంబునం బవ్వళించిరి. ఆసమ
యంబున గంధవహుండను దొంగ దనకుంగల యనంగ
నిశాచరుల వెనుక బలిమిం జేసి వారలమనోహరశరీరసౌర
భంబులం దోఁచికొను నభిప్రాయంబున బయలు వెడలి లోని
కిం జోర దారిం గానక యెట్టకేలకు జాలకజాలంబులవలనం
బ్రవేశించి తమవారి నిరాకరించు సర్వజ్ఞ పుండరీకాక్షులం
గని దొందంబునం బాడముభయంబున మనోభీష్టంబు దీరు
ననినాఁడ విడిచి కట్టకటా యదియేటిపాపకర్మము, సేచ్ఛం
దిరుగుచు సుఖంబుగ నున్న ప్రాణంబు గష్టంబునం బెట్టికొం
టి. మఱియు మనోరథం బీడేఱునని తలంచెదనా యటువిగ్ర
ప్రతేజంబున రాజిల్లు వారును బాజిపోదునని చూచెదనా
యిట నయోమయం బగు దారియు నాకాళ్ళకు బందాలు
వైచెను, నన్నుఁ గట్టఁడాత్రిళ్లు నేన దెచ్చుకొంటినని విచా
రించి తుద కొక యుపాయంబు పన్ని యారాజునకు నాదే

చంద్రుండును వేగుఁజుక్క యాదిగాఁగల నక్షత్రంబులును వెలవెలఁ బారియుండె. శకుంతసంతతులు దెలదెల వేగుటయుం గులాయంబుల వలనం గొలగొల గూయుచుం బిలబిల బయలు వెడలెను. తమోబాధుండు మేలుకొనునంతకు నిరవధి కార్యంబు లనిహార్యంబుగ జరుపుచున్నట్లు గనుపడంగఁ గొంతకాలంబు చేసియుండెనని యట్లుండియుఁ బదింబదిగఁ గుహూ లెక్కసేసి పంచమస్వరంబులఁ గోకిలలు కూయుచున్నవి. దీపికానికాయంబులు తమయందు దాఁచిన తేజంబుఁ గనీయనాయకునకిచ్చి తెలతెలఁబారె. ఉదయాచలాలవమూన యామిని గాయంబున నలందిన చందనంబు గళితంబగుడు లోచనగోచరంబగు తద్దేహరోచులనం దూర్పున నెక్కని కాంతులు గానవచ్చుచున్నవి. ఇంతకాలంబు మనవిహారస్థలంబున నీరాజు విహరించె వీనిం గళావిహీనుం జేయ కూరక పోదునే యని సక్రోధుండయి బయలువెడలె ననఁ గెంపారు బింబంబుగ నంశుమంతుండదిగోఁ దూర్పుకొండపయి నుదయించి చండమార్తండగణంబులను కిరణంబులం బంపుచున్నవాఁడు. తామరస సముదయంబు సముదంబయి వికసింపఁ చందుఁ దగుల్కొనిన చంచల చంచరీకసంచయంబు ప్రహృష్టాంతరంగంబయి గానంబు సేయుచు బయలువెడలెను సుమనస్సంసేవితులగువారు సహవాసుల సుఖదుఃఖంబుల ననుసరించి తామును సమ్మోదవిచారంబుల నొందుదు రని పెద్దలు చెల్పు పల్కు నిజంబుగాక వేఱొండగునే. మలయమానిలంబు మందమ్మందంబుగా వీతెంచుచు బలాకాబకక్రౌంచ చక్రవాక చక్రాంగాదిజలవిహంగమ కోలాహలంబుల ను

బూకచకోరాదిశకుంతసంతానాక్రందనంబులను గర్ణగోచరం
బులం జేసి భూజనంబుల నిద్ర లేపుచున్నది. దేవా! భవ
దీయకృపారసపంపూరితకటాక్షవీక్షణంబులం బ్రసరింపం
జేసి ప్రజలం గావవే, మేల్కొనవే యని మేలుకొలుపు
చుండ నాకర్ణించి మనఃకమలంబునం గలంకంబు హెచ్చియు
ధైర్యంబున నడంచి నాడ దేవునిం దానుసతియుం బ్రార్థించి
పడక లేచి సమయసముచితకృత్యంబులం దీర్చికొని సరస
హృదయ హృదయంగమంబును సభికముఖకమలభాసమా
నంబును నయి కమలాకరంబుం బోని యాసభామంటపం
బున దివాకరు కరణి క్షత్రియకులాభరణుండు ప్రకాశించె.

ఆసమయంబున ద్వారపాలకుం డొక్కరుం డేతెంచి
వినయభయంబులతో సాష్టాంగదండప్రణామంబు సేసియు
య్యుర్వీకులాగ్రణితో నిట్లనియె. దేవా! అవధరింపుండు. ఈ
దేశంబు జనులందఱుం దమవేదనల దేవరకు నివేదింపంగోరం
దఱ నియమించి పంపినారు. వారు ముఖశాలాసమీపంబున
వేచియున్నవారు సెలవేస కొనివచ్చెద ననవుడు నావసుం
ధరాధ్యక్షుండంగీకారసూచకంబుగఁదలయూఁచుటయు ద్వా
రపాలకుండును బోయి సార్వభౌముని యాజ్ఞయైనది లోనికి
రండని వారిం దోకొని రాజసమ్ముఖంబున నిలిచిన వారు
నవ్వారిజాప్తకులవల్లభునకుం గరంబులు మోడ్చి నమస్కారం
బు సేసి యారాజు ననుమతనుచితస్థలంబులం గూర్చుండి యిట్ల
నిరి. ఓ హరిశ్చంద్రరాజచంద్రా! మీ మండలమీహిందూ
స్థానవాస్తవ్యులు తమతాపంబులు దేవరకు నెఱుకపఱచి

తావక కారుణ్యరసంబున వానిం జల్లార్ప వేడ మమ్ము బంచిన
నేతెంచినారము. మావిన్నపంబుఁ దెలుప ముదలయేని మన్నవి
చేసికొనెద మని యనుజ్ఞఁ గైకొని యిట్లని చెప్పఁ దొడఁగిరి.
ఓమహేంద్రా! భవదీయసామ్రాజ్యరాజ్యంబున నేఁటివఱకు నేమి
యు నీతిబాధలం బొందక బంధుసమేతులముగ సర్వసౌఖ్యంబు
లనుభవించుచుంటిమి. సర్వసస్యసమన్వితయయి మాత
పోలె ప్రజలం గాపాడుచున్నయది. అతివృష్ట్యనావృష్టిభయం
బులు లేక "నెలకు మూఁడువానలు నిండఁ గురియుచుండు"
జనులశిష్టాచార సంపన్నత యేమి చెప్ప. అపమృత్యువు లెక్క
డను లేవు. జారచోరబద్ధకయాచకాదులం గానము. బధిరాం
ధాదివికలాంగులు మచ్చునకయినం గనఁబడరు. సర్వకాలంబుల
నిదాఘసమయంబులం గూడ నింకకుండు సరసీసముదయంబుల
నుదయంబగు సరసిజనికరాదికుసుమనికరంబులసరంబులను నిరం
తరప్రసవఫలాంచితపాదపపుష్పమాలికామాలికలను జేయు దేవ
తాపూజనంబులజపంబులందఱుం దేలుచుందురు. అట్టివారలకు
నేఁ డేమి పాపకర్మమో గాని యనంతంబులయి కన్పట్టు కష్టం
బులు సంభవించె. సింహశార్దూలాద్యభీలమృగంబులు భూమి
యీవిధ చందంబున లెక్కకుఁగాక దేవాసురసమరంబునందలి
రాక్షససంఖ్య నతిక్రమించుచుఁ దమబలంబులకుఁ దోడు రేలు
దోషాకరదత్తదృష్టి సహాయములు యఖిలంబు ఖిలంబు
సేయుచున్నవి. గృహంబులు వెడల భయంబయ్యెడి. అనేకజన
సముదయంబు లిదివఱకె యాదారుణమృగంబుల బారిఁబడె.

ఇంక నెందఱకు నాయదృష్టంబు సంభవింప నున్నదో తెలియ
కున్నది. వేసండకాండంబులచే ఖండింపంబడినకంజాతాద్యనేక
సుమజాతంబులం గలిగి వాని యథేచ్ఛాసంచలనంబునం గలంగి
జంబాలమయంబులున జలంబులం జెన్నఱి యుండెడు తటాకనదీ
నదంబులను భువనవినాశకారణంబగు విత్తులం జల్లఁ గలుప్రసి
యుటకనం గలమగర్భాదివిలసితంబయి యూరుపచ్చనయి కంటికి
శృంగారంబుగాఁ గనంబడు మొలకల వరాహంబులు వెత్తికి మూం
లంబులం జెల్లగింప వరిలేక ఘోరంబులం బరఁగు కేదారవారంబు
లను దమయధీశునకు శాత్రవుం డగువానికిం బరమ బాంధవంబు
లగునవి దనకును విమతులై గాన వాని నూటాడంజేయవలయు
నను కాంక్ష నావన వృషభాది పశుగణంబులు విదళింప నవిపడిన
వాని విడువ వలయు ననువిచారంబున వానితోడం గ్రింసంబడు
రమాకుమారమార్గణాభిరామకుసుమపాళిం గలిగిన మల్లికాది
వల్లీమతల్లికలచేతన చారుతరంబులగు నారామంబులను గలిగి
భీభత్సంబగు రూపంబు దాల్చి నిర్ధూమధామంబయి యుపాస్పృష్ట
తలంబు జనశరణ్యంబు గాకయున్నది. ఇట్టి యూహాపోహల నేప్లనున్న
గల నయిన నెఱుంగము. ఇంతదనుక దేవరప్రాపునం దలిదండ్రుల
చాటుబిడ్డల వడువున నేమియు నెఱుంగకుంటిమి. ఓరాజశేఖరా!
యిప్పుడీకష్టంబుల వలన మమ్ము దొలఁగించియసురానీకంబని
కంబును నాకంబునకుం బంపిసురలకు బాధానివృత్తిఁ జేసినయా
సర్వేశ్వరుభంగి సదయహృదయుండవయి రక్షింపవే. బిడ్డల
రక్షించుపని జనకునకుఁ గాక యేరికి" అని యనేకవిధంబుల

వేఁడుచున్న వారలం గని యాసర్వసర్వంసహాధీశ్వరుం డభయ
హస్తం బిచ్చి మంత్రిం జూచి వారల కిట్లనియె మీవారి వివేక
చాతుర్యంబులకుఁ జాలసంతసించితి. అందఱుం గూడి మొఱ్ఱవె
ట్టుట సందడికిఁ గారణంబనియు నసాధ్యంబనియుఁ దలంచి కొం
దఱం దమకుఁ గాఁ బంపిరి. ఇదివఱకు జనుల లాభాలాభంబులు
చెప్పు వారికిం దగుకార్యంబులం జేయవేఁడ సభలో నెవ్వరును
లేరయిరి ఎంతజాకరూకతతోఁ బాలించె ననినను మేము సర్వ
జ్ఞులముకాము గదా. ఎవరికష్టంబులు వారికి బాగుగఁ దెలియుం
గాని మఱి యొకనికిం దెలియవు. మీవలన నాలోపం బిప్పుడు
తెలిసినది. ఇదియాదిగాఁ బట్టణంబునకు మువ్వురు రాచకార్యం
బుల విషయమయి సభఁదీర్చినప్పు డేగుదెంచి నాకిందోఁచిన
యాలోచనంబులం జెప్పుచు వారివారి దేశంబుల సౌఖ్యంబు
నకు వలయువానిం గోరవలసినది. ఇట్టిపూజ్యాత్ములగుమీర
లింతమాత్రమునకు భయంపడ నేల. ఈక్షణంబ వెడలి యా
మహామృగంబుల మదంబడంచి జనుల నెప్పటియట్ల సుఖస్థితి
నుంచెద. పూర్వంబుకంటె నెక్కువ సౌఖ్యంబునకు దేశం
బెక్కు యగు నని తలంచెద. మీరు పోయి భయంబు వాసి
సకలజగత్కర్త మఱువక యానందంబున నుండుఁడని వారికి
సెలవిచ్చి సచివుండు దాఁ జేసినయేర్పాటునకు మెచ్చి పొగడు
చుండ నాతనిం గాంచి మనకు వేఁటకుం బోవఁ గావలయు
వస్తునివహంబుల నీక్షణంబున సమకూరంజేయుమని యాజ్ఞ
యిడి సభ చాలించి యంతిపురంబున కరిగి సంధ్యాదివిధులం.

దీర్చికొని పంచభక్ష్యముల భోజనంబునఁ దృప్తి నొంది సభ కేతెంచి మధ్యందినదినకరకరశోభాప్రతాపమునఁ దీక్ష్ణుండయి వెలింగె.

అంతకమున్న కిరాతవ్రాతంబులు దెచ్చిన వేఁటకుక్క లగమి «ఓయీ జగత్ప్రాణా! మే మిదె యాకాంతారాంతరనివాసక్రూరమృగవినాశంబు సేయ వచ్చుచున్నవారము నీవటకుం బోయి వాని నేమఱక కాపున నుండుమని తెలుపుఁ మని చెప్పకైవడి నాకాశంబునకయి మోర లెత్తి దిక్కు లన్నియుం బ్రతిధ్వను లీన భీకరారావంబు సేయుచుఁ, బాతాళంబుఁ జొచ్చినవి చచ్చినవియు రసాతలంబయిన నిట్లు పెల్లగించి వాని వారక మూలకనిరంకుశ ఖరప్రహారవారంబులఁ జీల్చెదము గా కూర కుంగుమే యను నట్లు పాదనఖమ్ముల ధరాతలమ్ము గీఁరుచు, జంతుసమూహంబు లయిం బోనీయక యాఁపెడి గొలుసుల ప్రయోగంబుఁ బండ్లం బటపట గీఁకి కొఱుకుచు వశంబుగాక విడువ నాఘ్రల వేఁడు వడువుఁ బోఁకల నాడించుచు నిట్టులు పలుచేష్టలం జేయుచున్న కుక్కమూఁకల యుండ, నీకిది తగవగునే మేముచేయుపనుల నావన్యంబులకు మున్ముందు దెలిపెదవు మారుతుండవు నీగుణంబుఁ బోనిచ్చుకొందువే యని కోపంబున వాయువు నలుకఁ గోరి రన ననేకాయుధంబుల జళిపించుచు సింహశార్దూల శరభ భేరుండాదులఁ గాలం జముఁడు మని చూపు కైవడిఁ జరణంబుల ధరణిపయి వ్రాయుచుఁ గింకరనికరంబులు పరికరప్రకరంబులు సమకూర్చు

కొని మంత్రివసువియాజ్ఞ నాఖేటనవిహారపరాయణంబులయి మొగసాల మొగిం గనిపెట్టియుండె. అంతనంతయు సిద్ధంబయ్యె నని విని యారాజమణి మణిగణఖచితానేకవిభూషణాలంకృతుం డయి నిజసతీసుతసచివప్రముఖపరివారపరివేష్టితుండయి యుచితవేషంబునఁ దురంగంబుల భంగి గరంబు నుఱుంగలించుతురంగసంఘంబుచే రంజిల్లు విరాజి పుష్పకంబుం బోని యొక్క కడాని యరదంబు నెక్కి మాతలి మఱపించు తన సారథిని పుణ్యాంబునకు మెచ్చుచు నడుచుచుండె. ఆరథంబు ననుసరించి యరిగెడి సాహిణుల వాహనంబుల హేషారవంబులు మిగుల, గజఘటను గీపెట్టుచుండ నాపరివారంబు జనుచుండఁ బురంబు గదలుచున్నట్లు చూపట్టి చూపఱకు నేత్రోత్సవంబు సేసె. అట్లు వాయువేగంబున నేఁగుచుండ రోహితాస్యుండు దల్లిం జూచి యిట్లనియె. "అమ్మా! యిది యేటి చిత్రము. మహీరుహంబు లన్నియుం బిఱ్ఱున వెనుకకుం బఱతెంచుచున్నవి." అని కొడుకాడు నుడుల విని యాసాధ్వియిట్లనియె "నాయనా! యవి నడచుట లేదు. మనము రథవేగంబున వృక్షంబుల వెనుకకు విడచుచున్నారము. ముందు పోవుచు మనము వానింజూచిన నవి మనవేగంబునఁ బరువులిడునట్లుఁ గన్పట్టుచున్నవి. ఒక నిమేషమునకు వెనుక మనము చూచిన యారామములకన్న యిప్పుడొక్క యోజనంబు వెనుకకుఁ బాఱినట్లుండి యదృగ్గో నగోచరంబగుచున్నది. నిజముగ నాలోచించి చూచిన నది మనదృష్టిపథంబు వలనం బరువు వాఱుట గాదు. మనరథం

బారసాలరనాడం బున్నతావున కీనిమేషంబున నొక్కయోజనము దూరము వచ్చినది. వృక్షం బచలంబు. స్థిరంబుగ నున్నది. చలించు చున్న యది రథంబు. దీనిచలనంబున గాకిం జలనం బజ్ఞానంబునం గల్పింతుము. ఇట్టిమనోవిభ్రమంబున ననేకులు దప్పుత్రోవలం బోయిరి. సూర్యచలనవిషయకవాదం బీదృశంబ యయి యున్నది. సూర్యబింబము మనము ప్రక్కజూచిన వృక్షంబువంటిది. భూమియో రథంబు వంటిది. రథంబు గదలుచున్నను జెట్లు సంచలించుచున్నవని యెట్లు భ్రమించితి వట్లే యనేకులు సూర్యుండు దిరుగునని భ్రమించెదరు. ఇంతియగాని వాస్తవంబుగా భూమి దిరుగుచున్నయది సూర్యుం డచలుం డయి యున్నవాడు. భూమి దిరుగుచుండిన మన మెట్లు నిలువంగల మని యడిగెద వేమో చెప్పెద వినుము. రథంబు దిరుగుచున్నను దీని పయి మనము కదలిపడకుండ యుండుట లేదె. ఈస్యందనంబునం బ్రాకేడు చీమ పగిది మనమీవసుంధర నుందుము. అట్టివారికి భూచలనంబున నేమి కీడు మూడును. అయినం గ్రిందను గదలుట మనము గందుము. భూగమనం బేల చూడలే'' మనియెదవేని వినుము. పుడమి రథంబుకన్న వేమడుంగులు పెద్ద. దానిగమనము మన వంటి యల్పుల కెట్లు గన్పట్టును. చీమ కీస్యందనంబు గదలుచున్నట్లు తెలియునా? తెలియదు. మనకును నట్లే యనుకొనుము. ఇంకొకటి వినుము. మనము పడమట నుండి తూర్పునకుం బోవుచున్నం దూర్పునుండి పడమటి దిశకు

వృక్షంబు వోయి నట్లు గనఁబడును. సూర్యుండు పూర్వ దిక్కుననుండి యపరదిక్కునకుఁ బోవునట్లు చూపట్టును గావున మనరథముం బోలె ధరయుఁ బడమటనుండి తూర్పునకుం బోవుచున్నది. సూర్యుఁ డొక్కచోటను గదలక యున్నవాఁడు భూమి తూర్పునకుం బోయిన సూర్యుండు పడమర దిక్కున నుండు. పడమరకుం బోయినఁ దూర్పున నుండు. ఇది మిక్కిలి ముఖ్యమైన యంశము దీని నెప్పుడును మఱువకు" మని చెప్పెఁ దలిం జూచి కుమారుండు "డమ్మా! మామిడిచెట్టో చరం బయినది కదా యేల" యని యడుగ నామె యిట్లనియె. "మనదృష్టికిఁ గొంత యాటంకము కలదు. కొంత దూరంబు వఱకె కాని నయనంబులు వీక్షణంబులం బఱపలేవు. ఇంతియ గాక భూమి గుండ్రము యయుండుటఁ గాన దూరప్రదేశంబులఁ గాన వనువు పడవు." అని బోధించి దీనిఁ జెప్పు డయిన మఱి చెడవు సుమీ యని యుపలాలన పూర్వకంబుగాఁ జెప్పెఁ గష్టంబు లేక సంతోషంబున దాఁ బోవుచుండం గిఱచెఁ గాన దిర్యక్ఛయన స్తుసంబంధ జ్ఞానంబునం జేసి యావిషయంబుల మనంబున నాతండు నిలిపె. ఈ శాస్త్రవిషయంబుల నామె ద్దుగ్గఱకి నామె దెలుపుచుండ హరిశ్చంద్రుఁడు మెచ్చి తలయూఁచి "ప్రియసురా! బాలికావిద్య వలన నింతశుభంబు గల్గునే. బాలికలు తల్లు లయినపిదపఁ దమపిల్లలఁ బిన్నటినాఁటనుండియు సన్మార్గంబునం బ్రవర్తింపఁ జేసి వలయువిశేషంబుల నెఱుకపఱతురు కదా! చిన్ననాఁడు నేరిచినది యెన్నఁడును మఱవ

నేరదు. అప్పుడు నేర్చుకొనినవి స్వాభావికసిద్ధంబుల యగు చుండును. అట్టి సమయంబుల బాలికా శిక్షింపంగఁదగు. నేర్చినఁ గొంతకాలంబునకు లోకంబున నందఱును సజ్జనులయి పవిత్రింతురనుటకు నేమి సందియంబు గలదు? మగవారివిద్యకుం గారణభూతంబగు స్త్రీవిద్యాభ్యాసము వృద్ధిపఱచుట పురుషవిద్యాభ్యాసముఁ గోరువారి కెల్ల నవశ్యకర్తవ్యము. అహాహా! ఇట్టి సద్వస్తు విదియని యెఱుంగింప నాతరంబె. ఇంతులకుం జదువు నేర్పిన దేశంబునకు రాజ్య నభ్యుదయంబు గలుగు' నని స్త్రీవిద్యాభ్యాసంబు మెచ్చుచుం జనిచని విశ్వామిత్రులవారి పూర్వతరంగసంఘాతసముద్భూత మధురతరగీతామృతనర్మదయగు నర్మదం గని యచ్చటిదిరివలి వనువలిచే విగతశ్రముండయి తిరిగి యరదం బెక్కి నర్మదానదీనీరసంవర్ధితభూజరాజవిరాజమానంబును నికుంజపుంజరంజితపర్ణకుటీరశోభితంబును ప్రమాహాభీకరవ్యాఘ్రారావఘూర్ణమానంబును నయి యేసమయంబునం గూడ నిబిడాంధకారబంధురం బయిన యవ్వింధ్యవసుంధరాధరసమీపప్రదేశంబుఁ బ్రవేశించి ఘోరారణ్యంబు నల్లడలం గాంచి తాను ననేకధాత్రీజమృగసంకులంబయిన యొక్కచక్కికిం బరమానందంబునం బోయె.

అటు వోయి ప్రళయకాలమేఘగర్జారావంబులవంబు నరకు సేయక నారివిరావంబు బ్రహ్మాండభాండంబు నిండ నతిజవంబునఁ బుంఖానుపుంఖంబుగా దారుణశిలీముఖంబుల నేసి శంఖానుశంఖంబులుగా ననేకపుండరీకగండభేరుండ

లులాయభల్లూకస్తంబేరమాది మృగంబులం బడవైచి వేఁట చాలించి మలయాచలసమాగతమందమారుతనివారితసంజాత ఘర్మబిందుజాతుండయి సచివశేఖరునితో సరసాలాపకలన నుండె. అట్లు తమచేతనే ననుజ్ఞాతులయిన భటసంతతిదంతురితసంతోషస్వాంతంబయి యంతకాకృతి నేఁగి యిదియు నదియు నను వివేచనంబు లేక తమాలరసాలపున్నాగవకుళాశోక జంబీరలవంగాదిభూజాతశాఖాస్థితకీరశారికా కాకపికమయూర ఖంజరీటాది ఖగంబుల నఱగన్ను వెట్టి సూటి సూచియుండ వింటి బద్దలఁ దివిచి యుండలం బంపుచు నూఁచల నేయుచుఁ డమాలాదివృక్షంబుల మఱుంగున మొఱంగఁ జూచు మాతంగంబుల కుంభంబుల విదళనంబు సేసి ముక్తాతతులం గనియుఖిలమృగంబుల బాణకృపాణంబుల నఱకుచు వేఁటకుక్కలచేఁ గఱపించుచు దీమంబులచే రప్పించి ఘోరతరచరణతలాహతుల నొప్పించుచు బలెంబుల నీఁటెలఁ బొడుచుచు నిట్లనేకవిధంబులఁ జిత్రవధ సలిపి యావనంబు నిర్వశేషంబుగ శోధించి క్రూరసత్త్వశరణ్యంబయినదని శిక్షించుటకో యనం గొమ్ముల విఱిచి పూలను బరిడ్లను నాకులను నలుగడల నలముకొన రాల్చి భీభత్సంబుఁ గావించి వేసరి వేఁట చాలించి యధ్యక్షుని సమక్షంబున కేఁగి తాము దెచ్చిన హారికటకంబులు ఫలంబులు పుష్పంబులు లోనుగాఁగల చిత్రవస్తువులఁ గానుకలుగా సమర్పించిన వానిం జేకొని యాసారసబాంధవకులాభరణుండు మంత్రికిం గొన్ని కళత్రంబునకుం గొన్ని పుత్రునకుం గొన్నిటి

ంగజకికవిలసనంబును శంఖచక్రాంకితలవంబులగుం దనపుట్టువుం దెలుప స్వర్గపాతాళమర్త్యలోకంబుల వెలయు నాఁడదీమతల్లికఁ బవిత్రికి శక్రనుఁడయి తీరం బడి కోహంచి సముయకృత్యంబులం దీర్చుకొని కొంతకాలం బచట సరసగోష్ఠి నుండిరి. అప్పుడు హరిశ్చంద్రుండు మంత్రిం జూచి "సత్యకీర్తి! విస్తారమార్గం బున నున్న మననగర ప్రాంతంబుం జేరుట కష్టతరంబు గాన మావరాక సఫలంబగు నుపాయం బొక్కటి చెప్పవలె నాలో చింపుము. ఇచ్చటి కనతిదూరంబున మరితలతావితానలవిత్రుం డును తేజోభాస్వన్మిత్రుండును సర్వజ్ఞప్రతిముండును గరుణా రసవిలసదతిమృదులతరహృదంతరుండును సుగుణరత్నరత్నా కరుండును నగు వశిష్ఠు డత్యంతంబు తపంబు సేయు నాశ్ర మంబు గలదు. ఆముని రాజు చరణరాజీవంబుల కెఱఁగి యా రాత్రి తదాశ్రమంబున నాశ్రమంబునం గడుపుదమని' చెప్పి మార్గస్థలంబు వీడుం దేరు దిసికొనిపొమ్మని సారథికి నానతి యా వతంసుఁడు హయంబులం బఱపి తరుణాగ్నిహోత్రంబు వలన బయలు వెడలు ధూమంబు గని యదియ మునినివాసం బని నిశ్చయించి యచ్చట రథంబు నాఁపె. అప్పుడు వార లారథంబు వెలువడి చని మార్గస్థలంబున జటాపటలం బరుణ కాంతి రమణీయంబయి యొప్ప మేన విభూతి నలంది శార్దూ లాజినంబుఁ గప్పికొని పద్మాసనంబున నుండి రుద్రాక్ష మాలఁ దిప్పుచు నిర్మలం బగు మనంబునం బ్రణవంబు సలుపు వసిష్ఠమునిముఖ్యుని గని తదీయపాదకంజంబులఁ గుంతలంబులు

చంచరీకంబు లట్లు ఝూంకరింప సాష్టాంగ దండ ప్రణామంబు సేసిన ఋషిపుంగవుండు వారల నాశీర్వదించి లేవనెత్తి రాజుం గని సప్రేమంబుగ నిట్లనియె.

“రాజోత్తమా మీరందఱు సుఖంబుగ నున్నారె? ప్రజల కందఱకును క్షేమంబు గదా. నీవిచ్చోటి కేల వచ్చితివి. రాజ్యంబు నీవును బ్రధానియుం గూడ విడిచి రాఁదగునె. నే నిట్టింటి నని కోపింపకు” మనవుడు నన్నరపతి మునివరున కిట్లనియె. “మునిలోకశిఖామణీ భవదీయ కారుణ్యంబునం జేసి మే మెల్లరము సేమంబున నున్నవారము. అనయము మదీయ సౌఖ్యంబు లరయుచుండు గురువరు లగు కతంబున న్నిట్లుంటిరి. దీనికిఁ గోపించిన నాకభ్యుదయంబు లేవిధిం గలుగ నేర్చును? గురులయానతి మీఱినవారికిఁ ఘోరంబుగ ఘోరంబులు ప్రాప్తించును. “నాస్తి తత్త్వం గురోః పరం” మ్మను పరమధర్మం బాబాల గోపాల ప్రసిద్ధంబు గాదె. కావున గురుని దైవం బని భావింప వలయును. ఇట్టి సద్గురునిఁ గలిగి యుంట నాయదృష్టంబునం గాక సంభవించు నెట్లు. అట్టిచో మీరు పలికిన పలుకులకుఁ గోపించుట వినాశాన్వేషణంబు గావున మదీయమృగయావ్యస నాగమకారణంబు నెఱింగించెదను వినుండు. ఈప్రాంతంబ నత్యంత క్రూరమృగసంఘాతం బయినఁ బౌరులందఱు వానిబారి కోర్వఁ జాలక నన్నిట్టి రక్షింప వేఁడినఁ దత్క్షణంబ నేనును ప్రజా సంరక్షణార్థం బాఖేటాటనంబున కేతెంచి యాసత్త్వనికరంబులఁ గరంబు వధం బడంచి సదమదంబు సేసి యున్నండపరవసుంధ

రాధర పరిసరకేళికారామవిహారంబున కరుగ భవదీయాభవ్య
నివాసంబగు నిచ్చటికి దేవరసందర్శనంబు మనంబునం గోరి
వచ్చితి.'' అనునంత నా వాక్యంబు లాకర్ణించి యావర్ణనీయకీర్తి
నీచేతకుఁ జేతోజాతప్రీతి నయితిని. జనులక్షేమం బెంతయు
డెందంబునం గోరు రాజన్యుం డనవరత మపరిమిత సౌఖ్యంబులఁ
నొంకుట కేమి యబ్బురంబు. నీపని సర్వజనసంస్తవనీయంబు
గాని మృగయావ్యసనంబునం దగిలి భీకరాటవులగుండ పుత్ర
కళత్రంబులం దీసికొనివచ్చుట కరణీయంబు గాదు. వీరలతోడ
నీవీరాత్రిఁ బయనమయి పోవుట యంతకుమున్న యకర్తవ్యంబు
గాన నీనిసి యంతయు సంతసంబున నిచ్చటఁ గడపి ప్రేపకడ
బయలుదేరు టుచితంబు.' అనివారలనాఁపి శేఖన్నై చక్రసంజాత
పదార్థజాతంబుచేత జాతసంతుష్టులం జేసి శయనంబున కను
వగు నిర్వు పరికించి వారలకుఁ గనుపఱచి యచ్చోటనిద్రింపుఁ
డని నియమించి తానును దనయోగనిద్రనుండె. అంతం దెల
దెల వేగుటయు మన్మందర లేచి గంగం దానంబులాడి వేద
పఠనపరాయణు లగునాయోగివరు నంతేవాసిగణంబుల వేద
ఘోషంబుతోడం గలిసి కీరశారికావారసుధామధురాలాపం
బులు వీనులకుం గలాపంబులు గాఁగ నాయతిథిచతుష్టయంబు
మేల్కాంచి కాంచనచేలు నల్లంబునం దలంచి లేచి యాగంగా
తీరంబునం గరణీయంబులం దీర్చి వివిధమధుర భోజ్యచోష్య
లేహ్యపానీయంబులం దనివి సని ప్రయాణోన్ముఖులయి గురుని
యానతిఁ గొన్నివారయి యాతని సమక్షంబున కరిగి తత్పా

దంబుల కేఱఁగిన వారిని దీవించి వసిష్ఠమునివరిష్ఠుం డానృపకుంజరున కిట్లనియె.

«ఓయీ, సార్వభౌమేంద్రా, మనువంశంబునం జనించిన నీకు ధర్మాధర్మవివేచన ధర్మాచరణంబులు కరతలామలకంబు లయినం గొన్నిటి వాక్రుచ్చెద. సావధానమతి వయి యాలకింపుము. ప్రజల నెప్పుడును గనుమూయక కాచుచుండ వలయును. ప్రజలు దేహంబు వంటి వారు. రాజు తదీయాంతర్వర్తియయి యెప్పుడు నడపించు నాత్మం బోలి యుండును. దేహాత్మలయట్ల ప్రజాప్రజాధినాథులన్యోన్యశోభావిరాజమానులయి యుండవలయును. న్యాయం బొక్క నిమిషం బయిన నేమఱక సేయ వలెను. పక్షపాత బుద్ధి యెన్నండును జనదు. న్యాయంబతిసులభంబుగ వ్యయప్రయాసరహితంబుగ జను లొందవలయును. రాజు సభామండల మండనంబయి గండుమీఱి ప్రతిక్షణంబునను న్యాయార్థులహితం బొనఁగూర్పఁజను తొల్లి యెల్లప్పుడుల్లంబులునం తల్లిల్లఁ దనజనగణంబుల గణన కెక్కఁగాచుచుండెడి నృగుఁడను మేదినీనాథుం డొక్కమాఱు కతిపయవాసరంబులు దనుక సభం గన్పట్టకుండినంగాదె శాపోపహతుండయ్యె. కావున నీ వనవరతము జాగరూకుఁడవై యుండుము. ధరణీనాథుం డెందును దన పరివారంబు గరంబు కనికరంబు దనర నరయుచుండ వలయునని కాదె పృథివీశుండు విష్ణ్వంశ సంభూతుం డని శాస్త్రంబులు వలుకు. కావునం దన నామంబు సార్థంబు గాఁగ రాజు ప్రజాసార్థంబుల తాపం

బువారించి యానంసుఖం దేలి పవలయును. కరంబు కరం
బుఁ గొనక యాజవ పాలింటి తోడఁ బరితృప్తి నొందునది.
అది గాదని జనుల యాదాయమున నంతయుంగొనఁదివురుట
పాలకయి పొదుఁగు నొత్తూకఁ గోయ గమకించుట గాన
నట్లు జేయఁగూడదు. శరణాగతభరణుండయి సామంతరా
జులమదం బడంచుచుఁ బాంధవోత్తముం డఖిలసత్కార్యం
బులఁ జేయుచుఁ గయ్యంబునకుఁ గాలుద్రవ్వక జనులఁ
బ్రోవం జను. ఎప్పుడును దనపరివారంబుల సౌఖ్యంబు పట్టి
యే తేని సౌఖ్యంబు నుండును. రాజునకు క్షేమంబుఁగోరు
చు ననురాగబద్ధమానసు లయిన ప్రజలు కలిగిన వారు
వెట్టని కోటపగిదిం గాచుచు వాని నెవ్వని కయినం దుఁయె
త్తిచూడఁ దరంబు గాకుండ నుందురు. కావున ప్రజలక్షే
మంబ నీసేమంబుగా నెంచి యంచితపరిపాలనంబునం గృతా
ర్థుండవగుము. పొమ్ము నీకు సర్వశ్రేయంబులు సమకూరుఁ
గాక యని మగుడి యిట్లనియె. ఇంకొక్కటి మఱచితిని
చెప్పెదఁ వినుము. నీవు కల నయిన విశ్వామిత్రు నాశ్రమంబు
సమీపంబునకుం బోవలదు. అతండు నీతండ్రికిం బరమమి
త్రుఁ డని పోనగు నని తలంచెదవుసుమీ. ఆమహర్షి రెం
డవదుర్వాసుండు. అతనికిఁ గోపం బుదయించుట నీళుల
నగ్ని పొడముట. ఆర్ప నశక్యంబు. నే నేమియో చెప్పితి
నని తలంచి నాబోధనంబులఁ బెడచెవింబెట్టక మనంబున
నిలిపి యట్లు ప్రవర్తింపుచు ననంతసౌఖ్యం బులందుము. తత్త

ణంబ రాజధానికిం బొమ్మ'' నవుడు హరిశ్చంద్రుఁ డమ్ము నిసెలవుఁ గైకొని సారథి రథంబు నాయితంబు సేసి వేచి యున్న తావునకుం బోయి యరదంబు నెక్కి నిజపుత్రకళత్రామాత్యసహితుండయి సంతసంబున నయోధ్యానగరంబునకుఁ బయనం బయి వెడలె.

అట్లు చనుచుండ మార్గమధ్యంబునఁ జంద్రకాంతితోఁ డందులదూగు ధవళరుచి నొప్పు రుచిరాననంబున నిండీవరంబులయందంబు నొందిన విరిగన్నులను బ్రిఫుల్లకల్హారపరిభాషటలోపమంబు లగు కర్ణశ్రీలను నీహారవారరుగను కారితుండాంచితరోచులను భాసిల్లుచు బంగారు చాయ రంగారు మనోహరశరీరంబున ముక్తాహారంబుల మాదిరి మీఱుజాలలం గలిగి పయిం బ్రవహించు సెలయేఱుల యేపునం జెన్నొందు నచలచ్ఛాతకుంభకుంభినీధరఖండంబు నోజం జూపఱకు నేత్రోత్సవంబు సేయుచు మునివరం దఱే నాలిబూతంబునకు నోడి సేవకు లయిరి. కద్రువదాస్యంబల తార్క్ష్యుని విధంబున నేనును వీరిసేవక వృత్తి విడిపింతునుగా కని భూలోకంబునకుఁ దననాయకుని యనుమతి నొంది యాతఁడు సంతరించి యిచ్చిన ముఖరోచిరాదులం బూని పూనక నేతెంచె నన నొక్క కురంగంబు గరంబు దురంగలించుచుం గాననయ్యె. దానిం జూచి లోహితాస్యుం డాస్యంబున మదహాసం బమందం బయి చెన్నొందం దల్లిం గని యమ్మా! యది నాకిప్పింపవే యాడుకొనియెద నని గారాబంబున ముద్దులు గులుకు పలుకులతో నడుగుచుండ

నామెయుఁ బలెఁగని మనముద్దుపాపని కా మనోహరమృగం బుఁబట్టి యీగే యాడుకొనుచుండు ననుచు ముచ్చట పడి యడుగ నిదె తెచ్చెద నని దానియనూనం బగు మేనిజిగికి నివ్వెఱగందె దీనిం దక్షిణ తక్షిణ యలయించి జీవంబుతోడ నుండంబట్టి పట్టికి నిచ్చెద" నని మనంబున నిశ్చయించి యావారిజమిత్రకులశేఖరుండు దేరు గడపు వానిం గని యి ట్లనియె. "ఓయీ సారథీ! నీనైపుణ్యంబంతయుం జూపింప నిదియ సమయంబు. అదిగో బారెడు దూరంబున బంగారు వికారంబగు మృగంబు నిలిచి యున్నది. అదియున్నతావు నకుఁ దావకరథగమనకౌశలంబు గనుపడంగను గనుమూత కాలంబులోన నరదంబుఁ దోలుము" అని యాభూభర్త యాజ్ఞ యిడ సారథి యట్ల రథంబుఁ బఱపఁ దమయెదుటఁ గనంబడు పెడియిజ్జె నివ్వెఱగందఁ దమ సామర్థ్యంబుఁ జూ పుటకునా నివారించు పరివాగెలబంట్లం గొఱకుచు నతిత్వరి తంబుగ బాఱువారువంబులను, నిజనాథునకు సంతసంబుఁ గూర్చుట కన్ననాయాసంబుగఁ బయికి నెగురు చక్రంబు లను. "వలదు వలదది మాయాకురంగమ్ముసుమ్ము మిమ్ము మొఱంగి తొఱంగి పోవుం గాని పట్టువడదేల? దారి విడిచి యట్టె పోయెదరు. మనకు దీన నెడరు పొడమును దిరుగు దిరుగుం" డని వెనుకకంజ వేయుచున్న దన వాయువేగ వశంబున వెనుకకు బాఱుకెక్కియంబునను వన్నియంకెక్కి నయాయురదంబు తక్షణంబున నా లేడి యున్న తావునకు నరుగుటయు నన్నరపతి దానిఁ బట్ట గమకించుఁడు నాకీ

లజ్జెంగి యా కురంగంబు చెంగున నొక్కగంతున లంఘించి యతిగూరంబున కేగి నిలిచి తేరు దన్ను సమీపింపఁ దమ వారికి దాస్యకారణుండగు నామారుతునిం బోడుచు విధమ్మునఁ గంధరమ్మువంచి కొమ్ములముం దిడుకొని పలుగెత్తి చు నదండుఁ గన్పట్టు నిషీకావారంబులం గసిగాట్లుగాఁ గొఱుకుచుఁ జెంగుచెంగున గంతులు వేయుచు నక్కడక్కడ నిలిచి పాదఖురంబులం దల గోఁకికొనుచు నిమేషంబున క్షేపదూరం బేగుచు నిట్లనల్పకౌశలంబునం బఱుగు వాఱుచు నావారిజాప్తవంశభూషణు నెంతయు నలయించుచుండె. ఆ చండాంశువంశమండనుండును వేసరక యాగాసికి నోర్చి దాని వెనుదగిలి ఎట్టకేలకు విసివి "యిది మాయామృగంబు గానోవు" నని యనుకొని తన్నుఁ గన్న మూసి తొలంగి పోఁ జూచు నాకురంగంబు పయి నంతరంగంబునఁ గోపం బుద్భవింప నాభూవిభుఁ డాలీఢపాదుం డయి. మౌర్వీటంకారంబు నిరాఘాటంబుగా లోకంబులు బెగడు పడ సలిపి దుర్వారచండమార్గణంబు సంధించి యాకర్ణాంతంబుగా విల్లు దివిచి దోర్బలంబున నమ్మువిడుచుటయు దాని సరకుగొనక సరగునఁ బరుగువాఱి పరిసరంబునఁ దపంబుచేయు గాధేయునివాసంబునకరిగి యాసారంగంబు లోచనగోచరంబుగాక మఱుంగు వడియె.

అంత నరుణకిరణుం డంబరమధ్యంబున స్వకులరాజ చూడామణికి నాయాసంబుఁ గల్పించెనని యాజింక పయిఁ

గోపంబునం బోలె నాఖిలతేజోవిరాజి యయి ప్రకాశించె. ఆరాజపురందరుం డమ్మాయామృగంబు వెనుదగిలి యెంతయుం దవ్వుమిన వాఁడు గావున నాతపక్లాంతలతాంతంబు రీతిఁ గసుగందిన మేసితోడ నుండె, యాఁకట నకనకంబడుచు వాడివత్తలయి యలసి మార్గాయాసంబునొందిన చంద్రమతీలోహితాస్యులం గని మంత్రితోడ నిట్లనియె. ''సచివోత్తమా యీ మృగంబు నదేపనిగం దవ్విమి వృధాప్రయాసం బనంతంబున కేపాలయితిని. క్షుత్పిపాసాపీడఁ గుసుమకుసుమార శరీరవిరాజులయిన వీరునుఁ గస్తి పడు చున్నవారు. నీవును నట్ల యున్నట్లు నీరూపంబ చెప్పు చున్నది. కాన మన కందఱకీకాన విమల సలిలశీతలం బయి ఫలవిలసితధరాజరాజాంచితంబగు ప్రదేశంబున నీమధ్యాహ్నము విడియ వలయున ట్లయినం గాని యీయాగాసికి,దొలంగ నేరము. ఉచితస్థలంబు మన కెక్కడఁ గన్పట్టునో యనవుడు నయవేది యయిన యమ్మంత్రిపుంగవుండు రాజుఁజూచి ''యల్లదె చూపు మేర దూరంబున దుర్వారంబగు నెండ వలనే మాకందాదితరునికరంబుల నీడ విశ్రమించిన యనేకసత్వప్రకరంబులవలని కనికరంబునఁ గరం బమరు సూన వితానాపుణం బగు చైత్రరథముం బోలిన వనం బొక్కండు గాన నగు చున్నది. అది సుమనోమాన్యం బగుటం జేసి రథాంగాది జలవిహంగమకోలాహలంబుల నీకు నాతిథ్యం బొసంగి యాదరింపఁ బిలుచు చున్నది. ఆరమ్యప్రదేశంబున నీవుఁట విశ్రమింత'' మని సచివరత్నంబు చెప్పుటయు వారంద

అచ్చోటి కతిరయంబున హయంబులం బఱపి యరిగి యావనిం
బ్రవేశించి తన్మధ్యంబున నంబుజప్రసవమకరందపానపరాయణంబు
లగు మిళిందబృందంబుల యందం బగు గానంబునను బిసకిస
లయంబుల మెసంగి సంతతంబు నట్టు నిట్టు దిరుగు హంససంత
తుల తోడను జలజాతవిహరమాణచక్రవాక వ్రాతంబుల
తోడనుం దారకా కాంతకాంత కాంతంబు లగు సోపానంబులను
బ్రతిఫలితసంచల త్తీరస్థితస్థిరాజవిరాజమానపర్ణవర్ణంబులను బాత
పుష్పపరాగంబు లీను పసపుకాంతులతోడం జెలంగుచు మీన
కచ్ఛపప్రముఖనిఖిలజలచరంబులచే విమలంబు లయినజలంబులం
గమనీయం బగు కమలాకరం బొక్కటి గన్నులపండువు గాఁ
గాంచి యరదంబు వెలువడి యానీరంబులం బ్రవేశించి స్నాన
పానంబుల నాయాసంబును డప్పిం దీర్చికొనిరి. తదనంతరంబ
తన్నికటంబున నిరుగెలంకుల విలసిల్లు పల్లవితమాకందంబు
లందంబుగాఁ జూచి కోమలారుణంబు లగు చిగుళ్ళను నంత
కన్న మీఁదిరి యిసుమంత పసుపు మిసమిస నెసఁగు లేయా
కుల నంతకన్న యించుక ముదిరి నీలపు రంగున్న రంగు మీఱు
పర్ణంబులను గాయలను బండ్లను శృంగారం బయి యనారతం
బొసంగు నీడ సమచతురస్థలంబున గుసుమరజంబున నడచి
నిమిషకాలంబునఁ గుసుమితకనకవల్లీమతల్లికాదివల్లికా వల్లి
బిల్లిగ్గ నల్లుకొని మెండ పొడల నయినం జొరనీక సౌరభ
భరితం బయి పరఁగఁ గరంబు మనోహరం బగు నొక్క నికుం
జంబుఁ జేరి వివిధమధురఫలాసవంబుల నాపాంథులు తృప్తి

నొందిరి. అంత నారాజు నిజరాజముఖికదళికోపమానోరుల శిరంబుఁజేర్చి శయనించి యుంచు కించుక గాలి దగుల రసాల కిసలయకల్పితమనోహరతాలవృంతంబునఁ బిసరంబున విసరు సారథిం గని యిట్లనియె. ఓయీ సేనానాయకా యీవనంబున జిలుకలును గోరవంకలును గొఱ లేక తొలినుడుల శ్రవణా నందంబుగా నుడువుచున్నవి. జంతుసంతానంబు లన్యోన్య వైరంబులు వీడి చెలిమికలిమి వెలయుచున్నవి ఇవియన్నియుం జూడ నిదియేదియో మునియాశ్రమం బని తోఁచుచున్నది. విజనం బగు నీవిపినంబున నేమౌని యనూన తపంబున ధన్యతం బొందుచుండునో దెలిసికొని రమ్మని యాజ్ఞాపించిన నాతండు వెడలి నాలుగడుగు లిడి యానీడ దాఁటి పోవ సమీపంబునఁ బుష్పంబులు దేవతార్చనకుం గోయు నొక్క మునికుమారుండు దృష్టిపథంబున నిలిచె. ఆతనిం గాంచి యాపృతనాధీశుండు నమస్కరించి "భూసురకుమారా యివ్వనం బేమహాత్ముని యాశ్రమంబు నీ వెవ్వండ?" వని యడిగిన నప్పుడమివేలు పిట్ల నియె. "ఈవనంబున వసిష్ఠముని దుర్వార గర్వనిర్వాపణశక్తి స్ఫారేయుండగు గాధేయుండు సకలదానసమానన నివాసుం డగు సర్వేశ్వరుం గూర్చి యనవరతంబు తపంబునల్పుచు శిష్య సంఘంబుతో నివాసంబు సేయుచుండు. నే నమ్మహర్షి పాద పంకజసేవా విశేషంబున నశేషసంతోషభాజనుండనయి యుండు దును. నీ వెవ్వండవు. ఈ నికుంజమధ్యంబున విశ్రమించిన వా రేరు దెలుపు మని యత్తపసికొమరుం డడుగుటయు నాలించి

యామానుషుదారుదార యిట్లనియె. "ఆచిగురుసెజ్జం బవ్వళించి నది యఖిలవిమతభూపాలమాతంగమదవిపాటనచణమృగేంద్రుం డగు హరిశ్చంద్రనరేంద్రుండు. అక్కడ నాడుకొను రూపజిత మారుం డగుకుమారుం డాయన కుమారుండు, లోహితాస్య నామంబున నందలకుం బ్రసిద్ధుఁడు. ఆయధ్యక్షుని మ స్తకంబు దనయూరువుల పయిం బాసిల్ల నుల్లసిల్లు నాలోకైకమాత తత్పార్థివకరగృహీత. ఆ మాధవీలతానికటంబున నాసీనుం డయిన ఘనుం డమ్మహామహీని సచివోత్తముండు సత్యకీర్తి యను నాహ్వయంబున జగద్విఖ్యాతి నొందు. నే నాభూరమణు సారథిని. ఇప్పుడ యారథికు ననుగ్రహంబున వరూథినీ నాయ కుండ నొక్కండ నయితిని. నా పేరు చక్రహస్తుం డందురు. దైవవశంబున మే మిక్కడకు దారిం దప్పి వచ్చితిమి."

అని తమయుదంతం బాద్యంతంబుఁ జెప్పు చుండ నా ఋషికుమారుండు "దేవతార్చనకాలం బతిక్రమించెను. నేఁ బోయెద" నని యాతని నాశీర్వదించి యాశ్రమంబునకుం జని యాసమాచారం బంతయుం గౌశికునకుం జెప్పిన నాహంస్తా వతంసుని నయనోత్పలంబులు వారిరాకకు నమితవికాసంబు నొందె. అంత నూతనంబుగఁ బ్రభుసన్మానమ్ము నొందిన య మ్మహారాజానుచరుండు నాథునిం గాంచి "దేవా యిచ్చటి కొక్క మునికుమారుండు వచ్చిన వాని నడిగి తెలిసికొంటి నిది గాధేయునాశ్రమం బఁట యిట కనతిదూరంబున నన్నిరా హారి తపంబు సేయు చుండు నని వింటి" నని విన్నవించిన విని

యవనీజాని గుండెఝల్లన మొగంబు వెలవెలఁ బాఱ నా
పడియుండి కొంత సేపునకుఁ దెలిసి యిట్లని చింతించె.

"హా! దైవమా! యెట్టి మోస మయ్యెను ఎఱిఁగి యెఱుఁగమి నయినఁ గౌశికు నాశ్రమంబునకుఁ బోకు మని వేవిధంబులఁ జిలుకకుఁ జెప్పినట్లు మద్గురువరుఁడు బోధించె. అటులు చేయుదమనినిశ్చయించితో లెఁగిపోఁదలంచిన డాఁగఁ బోయినఁ దలారియి ల్లయ్యె నన్నట్లు విధివశంబున నీస్థలంబునకు యేతెంచితిని. అకటకటా యెట్టియకృత్యంబాచరించితిని. నన్నిటులు గురుని యానతి నతిక్రమింపం జేయ నీమాయా కురంగం బెక్కడ దాపురం బయ్యె. అయ్యెఁబో దానిదారి దానిఁ బోనీయక యత్యాశాపిశాచావేశంబున మతిచెడ్డ లెఱుఁగక యిట్లెలవెనుదగిలితిని! హా! అత్యాశయెట్టివారలకును జెట్టబుట్టించును గదా. తనస్థితితోఁ దృప్తినొందు నాతఁడె సౌఖ్యంబునకిరవగు. 'సహసా విదధీత నక్రియా'మ్మని యార్యులు పలుకుచున్నను వినాశకాలే విపరీతబుద్ధియన్నట్లు నాబుద్ధి పెడదారిం బట్టె. ఇఁక నే నేమి సేయువాఁడను. ఇప్పుడయ్యమ్మని యిది యంతయు నెఱుంగకుండఁ దత్క్షణంబ పురంబున కేగుట మేలో యాతని దర్శనంబు సేసి తత్ప్రసాదంబు వడసి పిదప గృహంబున కేగుట మేలో యేమియుం దెలియకున్నది. ఆఋషి యెఱుంగకుండం బోవుద నన్నఁ ద్రికాలవేదియగు నవ్వేదవేది దివ్యజ్ఞానంబుననస్మదాగమన వార్తం దెలిసిన నాతని యాగ్రహం బినుమడి యగు. కోపం

బున కీర్తుఁడు పెట్టిన పేరు. మౌనులసమానశక్తిసంపన్నులు. కోపించిన నొక్కనిమిషంబున నెట్టిదిట్టనయిన నధమాధమ స్థితికిం జేర్తురు. అనుగ్రహించిన నెట్టి నీచు నయిన నెట్టి యల్పు నయిన ఘనునిం జేసి యున్నతదశం బొందింతురు. కావున నిప్పుడవోయి యమ్మహామహుల గని నమస్కరించి దీవనలం బొంది ముదంబున రాజధానిం జేరుట యుచితమని తోఁచుచున్నది. అయిన నేమి చేసిన నేమి యగునో. ఇదమిత్థ మ్మని నిశ్చయింపం జాలకున్న వాఁడ" నని విచారంబున నా భూవిభుఁ డువితర్కింపుచుండ, "సింహనినాదంబు వినిన వేదం డంబు కరణి నిది విశ్వామిత్రు తపోవనంబని యాలించిన తోడనె భూకాంతుఁడు ఖిన్నుండయి యున్నవాఁ డిప్పుడీతనిఁ బ్రబోధించెదం గాక" యని రాజుం జేరి సత్యకీర్తి యిట్లనియె. "దేవా చక్రహస్తుం డిది కౌశికునాశ్రమంబని విన్నవించిన విచారపారమానసుండ వయి యున్న వాఁడ విది గాధేయు నివాసం బయిన నేమి. మునులనాతఁ డేమి చేయును. సర్వసము లయి భేదాభేదా భావంబున భావంబులు నిర్మలంబు లయి యుండ ననారతము తపంబు సేయు సంయములకొకరిమీఁదఁ గోపం బుదయించునె. ఎట్టి యపరాధి నయిన క్షమింతురు గాక శిక్షింతురే. అట్టి వారపారపారావారమేఖలాంచితమహీ తలభరణదక్షుండును, రజతహేమధరాధరంబుల నయిన నొం పక సత్పాత్రదానంబు సేయునట్టివాఁడును ధైర్యసంపన్నుం డును సత్యాలాపకలాపుండు నయిన నీమీఁద నాగ్రహిం

తురె. కామక్రోధాదివశు లయినవారలె నీయందు బద్ధానురాగు లయి కోపంబునకుం గారణంబులేక యుండ శాంతిదాంతి నియమవరిష్ఠులగు మహర్షి గరిష్ఠుల మాటవేఱె చెప్పనేల. మునులతపోరక్షణం బెప్పుడును జేయుభారము భూరమణులది గాదె. అట్టి యెడల నీకౌశికు నెడల నెడఁద నీ వేల భయంబు నొందెదవు. ఇంతియ గాక గాధేయుండు వినయవిధేయు లగు మీవంశంబు వారి పక్షంబున నవ్యాజకరుణవహించి యుండును. తొల్లి మీజనకుం డ్రిశంకుమహారాజు నమరానీకం బెల్ల నొల్లకున్నను బొందితోఁ గైలాస బునకుం బంపఁడె. ఇంత యేల కొంత కాలంబునకు వెనుక దేవరదర్శనంబునకువచ్చి యాగంబుఁ జేయ స్వాస్థతేయంబు వేఁడిచనలేదె. ఇట్టిమహానుభావుఁడు భవదీయపోష్యవర్గంబులోనివాఁడయ్యెను నీవయిం గనుకఁ బూనుమనె. వెఱపు దక్కి విశ్రమింపుము. ప్రచండమార్తాండు నాతపంబునం బొఁడిమిచెడి యాయాసము నొందియున్న వాఁడ వించుక సేపు నిద్రవోయి సౌఖ్యంబుఁ బొందుము." అనిపలుకు నమాత్యశేఖరువివేకవచనకమలాకరతికరంబులగాఢవిచారతమ బువిరియనయనవనజంబులు మోడ్చి యెట్టకేలకు నిద్రఁజెందె. నిద్రవోయి కొండొక వడికి లేచి ధైర్యంబు విడనాడి వడివడిం బొడమిజాలువాఱు బాష్పపూరంబులు గనకచ్ఛవిమనోహరంబగు గండస్థలంబున ముత్తియంబుల పేరులం బోలెమీఱ, శరీరంబు గజగజ వడఁక నలుదిక్కులుచూచుచున్న యన్నరవరుఁ గని

తరుణీమణి యగు చంద్రమతి మతి వెతఁ బొందుచు నాభూ
మీశుం జేరి యరుణరుచులతో మనోజ్ఞం బగు తనకరంబున
నానరవరు వీపు చఱచి యనర్ఘ్య మాణిక్యమౌక్తికమయం
బగు కంకణంబు సకలలోకరక్షణాచరణం బగు నాభూభుజు
భుజంబున రక్షగాఁ గట్టి యిట్లనియె "నాథా నేఁడిదియేమి.
నీవెన్నఁడు నిట్లులికిపడ నెఱుంగను. స్వప్నం బేల మేలుకాంచి
కంపంబు నొందెదవు అఖండ భూమండలాఖండలుండవయి
శరణన్నవాని నెట్టియాపద నున్నను గాచుచు సర్వవిరోధి
గర్వనిరోధివసుధాధినాయకుండ వయి సకలసుగుణగణమణి
భూషణాలంకృతుండవయి మేరుధరాధర సమాన ధైర్యధు
ర్యుండవగు నీకు భయంపడ నేల" యనుచుఁ బ్రబోధించు నిందీవ
రాక్షింగని మందమందంబుగా వసుంధరావరుం డిట్లనియె "
పడఁతీ నే నొక్క పాడుకలం గంటిని. దాననిదియంతయు నని
వార్యంబయి పుట్టె. నిండోలగంబున నిండువేడుకతో నే
నుండుతఱిఁ నెవ్వఁడో పాఱుఁ డొక్కఁడు గోపారుణితనేత్రుండ
యి నామీఁదఁ గటకటంబడి మామకమస్తకాంచితకిరీటంబు
ధరణింబడఁ గాలం దన్నియంతఁ బోవక నాశిరంబు వట్టియీడ్చి
కనికరంబుఁ దొఱంగిన గరంబు వెడలనడిచె. నేనును నేకవిధా
పాయపారావారంబునను నింగియీఁదియీఁది యెట్టకేలకున
పారకరుణారసామృతఝరీధారేయుండగు సర్వేశ్వరుననుగ్ర
హంబున దరిఁ జేరి తిరిగి మదీయప్రాజ్యపూజ్యరాజ్యంబున కధి
ష్ఠుండనయితి నంతట మేల్కాంచితిని. ఇదియ నామనో ధైర్యంబుఁ

జరింపం జేసిన యది. " యని చెప్పినవిని చంద్రమతిమనం
బున దిగులొందియు నొందని వదువునఁ గన్నుట్టి నాథునితో
సుధామధురాలాపంబుల నిట్లనియె. "రాజోత్తమా! యింత
మాత్రంబున కేల వగచెదు. అదె పదింబదిగ మనంబున
విచారించుచు నిద్ర నొందిన కతంబున నీస్వప్నంబు గలిగె.
కీన నేమి యుపద్రవంబుసంభవించును? కలనిజంబయిన నేమి
లోపంబు? కలలున మనలనవులం బో నడిచిన పుడమి
దయ్యంబు గాధినందనుండు అతండు కిరీటంబుఁ దన్నుట
రాజ్యవిహీనత్వక్రియాసూచకంబు. దానం జేసి మన మనేకం
బుల గు నిడుమలఁ బడి తదనంతరం బంబరకేశపాశుం డగు
నీశుని గారుణ్యంబునం జేసి సకలసామ్రాజ్యంబు మహావైభ
వంబున నొందుదుము. ధనంబులు శాశ్వతంబులుగావు. ధర్మం
బొక్కటియ యక్షయంబయి రక్షించునది. ధర్మోజయతియను
వాక్యంబు మోఘం బగునే. సత్యాలాపంబుమానక మాని
తంబుగ జీవితంబుఁ జేసిన నశేషసంతోషంబు లొనగూడుఁ
గావున నీవో నాథా! సర్వజ్ఞుండ వయ్యు వెఱ్ఱివానిగతి నల
మటి నొందనేల" యని యయ్యినకులశేఖరునితోడ నమ్మది
రాక్షి యక్షయధర్మవాక్యంబులఁ బల్కుచుండె.

అప్పు డవ్వనంబున వసించుచుఁ బుట్టుక చే మసిపాత
మాణిక్యంబులంబోలునిరువురు మాతంగమత్తమాతంగయాన
లుచందురుమామ మాట్లాడనీయని సుందరాననంబులఘర్మ
బిందు సందోహ నీహారకణ వారంబు జాఱుచుండఁగఁ జేతుల

నమరు చిన్ని రుమాళ్ళచేఁ దుడిచికొనుచు, నీలకేశపాశఁ బాతపతాపనివారణకారణాతపత్రంబు భఁగిఁ జెలంగనపాంగావలోకంబుల నలుఁ బ్రక్కల విలాసంబుగాఁ బ్రసరింపఁ జేయుచు బిసలతోవమబాహాయుగంబులతోడఁ గొప్పుసవరించికొనుచుఁ బయ్యెటం జక్కఁదీర్చుచు సందంద సుమబృందంబులనందికొని కబరీభారంబున ముడుఁచుకొనుచుఁ గొన్నిటిఁ బాణిపద్మంబున బాసిల్లం జేసి వింత గొలుపుచుఁ గనకంబు మిసిమిం బకపకనవ్వు దేహకాంతులు జిలుఁగువలిపెదట్టబు వలన వెలువడి సకలజనాశాపాత్రంబులయి వెలుఁగ గిలుకుమట్టెల కలకలంబులం గలిగి మ జీరఝుళ ఝుళధ్వనులచే మరాళంబుల జేరంజీరుచునొయ్యారంబున నల్లనల్లనఁ దామరల గేరుపదంబుల నెత్తిపైచుచు మృగమదచందనకుంకుమ గోరోచనప్రసవమంజరీసౌరభంబులు ఘుమ్మనుచు నలుగడల నలముకొనగనిర్వాచ్యాతివిలాసంబు నలసాలసయానంబున మానవాధీశపరివారవిరాజమాన నికుంజముఖలలితప్రశస్తానేకవల్లికాకల్పితకాయమానంబు నుస్సురనుచు నొయ్యనొయ్యనఁజేరి యారాజేంద్రుం గని నమస్కరించి యిట్లనిరి.

"ఓహరిశ్చంద్రమహారాజా! పరాకు. సకలదశావిశాలనయనాభరణాయమానయశోధనవిరాజమానమానవాధీశా! పరాకు దేవరవితరణాద్యనేకసుగుణగణంబులెల్లఁ బొగులునుతింపఁగర్ణరసాయనంబుగానాకర్ణించివానిచేనీడ్వంబడి యిట కేతెంచితిమి. మాయదృష్టంబున మిమ్ముం బొడగఁ

టిమి. మాకోరిక లన్నియు సఫలంబు లయ్యె" ననవుడు నా యంబరమణికులమణి వారలం జూచి "మీర లెవ్వరు? మీ దయ్యది జాతి. మీ నివాస మెక్కడ. మీ రిటకు వచ్చిన కారణ మేమి? మీ వృత్తాంత మంతయుం జెప్పుం" డని యడిగిన నాలసమానా గుళసమానరసాలఫలనిరసనచణాతిమధుర వచనంబుల నిట్లనిరి. "ఓ భూపాలతిలక! మామకనివాసం బీ యరణ్యంబు. మేముచ డాలకులంబునం జన్మించితిమి. దేవరసందర్శనంబునకిటువచ్చి భవదీయభవ్యభావుకాకారంబిటం గంటిమి. మేముగానకలానిపుణలము. వీణవాయింప నేర్పుచాలం గలదు. దేవరకు వినిపింపకున్న మావిద్య విద్య గానేర దని యిక్కడకు వచ్చితి మటుగాన గానంబు సేయ నించుకమా యందలి కరుణననుజ్ఞ యొసంగ బాడెదమని యారాజుముఖారవిందంబువలనం దదీయభావంబు గని నిగమించు నఖంబుల వీణ మీటుచు శిలలుగరంగి ప్రవాహంబులయి జాలువాఱ పశుగణంబు మేతమాని వీనులు నిక్కించి వినుచు నపారానురాగంబు నొంద నల్లడల నన్నియు నిశ్చలంబులయి యాకర్ణనశ్రద్ధాతిశయంబున మీఱ వీరు వారన కందఱు వెఱంగంది గంధర్వచంద్రాననల విభ్రమియింప సకలస్వరంబుల నెలుంగులెత్తి యా సంగీతపారంగతలు గానంబు సేసిరి. ఆలోకాతీత గానంబువలన నారాజు హృదయంబున ననంతసంతోషంబు నొంది నేత్రంబులు దెఱచియు నేదియుం గానక మనంబున లోకంబు మఱచి యుండె. వారాగానంబు మానినతోడనే

యాచానలంగని యాశ్చర్యంబు నొంది తన్నైపుణ్యంబునకు మెచ్చియనర్ఘ్యమణిగణాభరణంబులబసదనంబుగానొసంగిన గని యాగానసంగులయంగనలు మల్లికాకుందంబులఁ డిందుపఱచుచు ముత్యంబుల కరణిం బరఁగు పల్వరుస బయికిందోపఁ బక్కున నవ్వి యిట్లనిరి "దేవర సకలేంగితజ్ఞులరు. ఈవస్తు నివహంబులతోడ మే మేమి సేసికొనెదము. నగరంబుల విలువ గలిగిన యీపదార్థజాతంబు లిచ్చుట నెట్లుపయోగించును? ఈవనలక్ష్మి మాయం దనుగ్రహించి మా కొసంగు నాభరణంబులె యాభరణంబులుగాని మీ యట్లు వీనిమేము ధరింపనొల్లము. వేఁడిమయూఖంబులవాఁడిమివాడివత్తులయి గాసినొందితిమి. అఖండతీక్ష్ణుండయి మార్తాండుండంబర మధ్యంబున వెలుఁగుచున్నవాఁడు. ఆయెండం గాలిడినఁ బ్రాణంబులు దక్కునె. భవదీయమాన్యసితచ్ఛత్రంబుమా కొసంగి కారుణ్యంబున నాతపతాపంబు నివారణంబుగావింపుము. మీరుదయసేయు వివిధరత్నాభరణంబులేల. నేయిఁ డాఁచిన దాహంబు దీఱునె. కావున మాకా వెల్లగొడుగు ననుగ్రహించి తాపంబువాపి సార్థకనాముఁడవుగావె రాజోత్తమా" యని వేఁడిన నాపుడమిఱేఁడు మండిపడి యాపడంతుకల కిట్లనియె. "సిరిరా మోఁకాలొడ్డనేల? నేనొసంగిన స్వాపతేయంబుగొనక మామ కాతపత్రంబు మీకుఁగోరనగునే. అందని మ్రాని పండ్లకఱ్ఱు సాచుట నిష్ఫలంబాయాసజనంబని మీ రెఱుంగరే. క్రిందు మీదెఱుంగక చండాలజన్మ

లయిన మీయుత్తమరాజన్యానుభోగ్యవస్తుజాతంబుల వేఁడ
నగునే వెలివాతపురంబోఁడులేకసర్వోత్తమక్షత్రియపాత్ర
పదార్థంబుల కామిక లేక పూర్వంబెందఱు ధరణీనాథులు
దానంబు సేయ రెందఱు దానంబులం గొనరు. ఎందయిన
నెట్టి పంతల పెంట్టిమెి ఈరాని వస్తువుల వేఁడఁ గూడునే.
అల్పబుద్ధి మూరక పోవునే. ఇంకనయినం బుద్ధిదెచ్చుకొని
తాపనివారణంబులగువస్తువులన్యంబు లేవియయినం గోరుఁడు
వాపుడు నానందంబునం బొంగి యాగోసంగులసారంగాక్షు
లయ్యారే దాత యన నీరాజు జెప్ప మఱియొకనిం జెప్ప
వలయును. ఆడిన మాట తప్పక సకలలోకంబులఁ బ్రసిద్ధి
కెక్కు నీనరవరుండు తాపంబు వాపు నితరవస్తువు లేవి
యయిన నిచ్చెద వేఁడు" మని యానతిచ్చెనని యయ్యనకు
లోత్తముండు వినుచుండ నొకరితో నొకరు పల్కి సవిన
యంబుగా నిట్లనిరి.

"రాజశేఖరా ! ఖరకరకరసంజాతతాపం బంబుజ
మృణాలకర్పూరహిమవారిచందనమందమారుతాతి శీతలాల
యంబుల లయంబు చేయ నగుం గాని యించువిల్లు దివిచి
మూరుం డేయుకుసుమసాయక నికాయంబుల పాతంబునఁ
గాయం బయ్యెం గాయంబులువడి వడింజనియించెడివేదన
వారింపఁదరంబుగాకున్నది. భవదీయ బాహాపరీరంభణంబునం
గాని యదియడంగ నేరదు. దానంబు సేసితి ననివాగ్దానంబు
సేసితివి గాన నోసదయహృదయా మదనవేదనాపనోదంబు

సేయం గమకించుము." అని తెంపున యాచించు నాచిలు
కులకొలుకుల పలుకులు విని తత్క్షణంబ హరిస్మరణంబు సేయు
చుం జెవులు మూసికొని యిట్లనియె. "మీరు విద్యావతులు
యాచకులు నని యెన్ని విధంబులం గరుణించినను వినరాని
మాటలెల్లం బలుకుచు మీ తుచ్ఛబుద్ధి విడనాడకున్నవారు.
మిమ్ముం జూడ నర్థినులయి వచ్చినట్లేమియుం గన్పట్టదు.
త్రాగుబోతులరీతి నవాచ్యంబులు వలికెదరు. ఇంక నిట్టి
వాక్కులు నోర వెడల నీయక యీక్షణంబ వారేని నాలు
కలు గోయింతు నని కోపంబునం బలుకు నారాజపుంగవు
నాలోకించి చలంబున నేమియుం జడియక యావిలాసవతు
లతివిలాసంబుగా శృంగారచేష్టలం జేయుచు నమ్మహారాజు
విశ్రమించి యున్నడాపునకుం బోయి ధీరతతో "భూపా
లకా! యేల జంపు నడిపెదు. ప్రాణరక్షణంబున కంటె
పుణ్యంబొండు గలదె. మదనాగ్నితప్తల మగు మమ్ముం
బ్రోవుము. నీకును సంతోషంబు గలుగు పుణ్యకార్యం బిది
గావున మామక సౌరభ మనోహర శరీరోపగూహనంబున నన
ల్పసౌఖ్యంబు లందుము. ఈలతాగృహాంతర్గంబున నంతరం
గంబు సంతోషభరితంబుగాంగ నుండుద మటకు రార"
మ్మని సాహసంబున, దనకులనాథుని తేజంబు తేటపఱుచు
కరణిం బ్రకాశించు వజ్రవ్రజస్థగితానేకాభరణభరితం
బయిన యమ్మరాజు దక్షిణహస్తంబు కంకణ కింకిణీర
వంబు లెసంగ దెమలింపం గమకించుటయు నా కీలెఱింగి
యాగ్రహంబున నయ్యవనీజాని కన్నులెఱ్ఱసేసి వారిని

చారింప నారివిరావంబు సేసె. దానిం దెలిసి విమలమనోతిసం చితసత్కీర్తి యగుసత్యకీర్తి మాతంగకుంభవిభేదనాయత్తం బగు పంచాననంబు నాఁపిన భంగి నాపతంగకుల పుంగవు బాహులు నట్టి సాంత్వనస్వరంబున నిట్లనియె.

"ఓ యినవంశాధీశా, యీపంకజాననల పయి నీకుఁ గోపం బుద్భవించు టుచితంబె స్త్రీ లెందును నవధ్యలు గారె. పిచ్చుక పై బ్రహ్మాస్త్రంబు సంధించిన విధంబున నీబింబాధరల పయి నీ వౌడు గఱచుట తగునె. ఈలలనాలలామలపయి భవదీయ బాణగణంబు వేయుటెంత ఘోరకార్యము? వీరు నీవైరు లని తలంచెదవే నృపాలకా; యాచకులు గాని యెండు గారు గాన ననుగ్రహింపు" మని వేఁడి యార్ద్రావలంబుంగొని మాయుక్షకాతాళంబు సరససంప్రార్థనాలాపంబుల నాఁపు టయ్యు నమ్మనుజేశ్వరు నీక్షించి చంద్రమతీచంద్రవదన ఖిన్నాత్మ యయి "ఓ నాయకా! నీ విటు లేల వివేకంబు దక్కి యున్నాఁడవు. ఇది యేమి యాశ్చర్యము. మనము దారిం బోవుచుండ నామాయల మాడి జింక యేల గనుపడి మనల నీయారామంబునకు బాలు పఱిచినది. ఎక్కడి యారామం బిది. వీర లెక్కడిరాములు. ఈ భామల వెలివాడ పుట్టు కేయూరు నీ సౌందర్యం బేయూరు? ఇది యంతయుం జూడ వింతగాఁ దోఁచు చున్నది. కపటమాయాధౌరేయుం డగు గాధేయుని కల్పితం బయి యుండఁబోలు. గురుని మాట సమయమునాఁ" యని ప్రాణేశు తోడ విచారించు చుండ

నా గోసంగివాగువలు "వనిత తనంతఁదా వలచి వచ్చినఁ జుల్క
నఁగాదె యేరికిన్" అనుచుఁ జరుకైన నాయిక వదలి వీడిన
కచబంధంబులతో వాడిన మోముదమ్ములతో రాలిన ముత్యాం
బులతో నలిగిన దేహంబులతోఁ దడఁబడు నడుగులతోఁ దూలు
చు శోకదేవతలో యనం గన్పట్టుచుఁ గౌశికు నాశ్రమంబునకు
సత్వరంబుగ నేగి యాతని పాదములం బడి యాక్రందనంబు
సేయం దొడంగిన వారిం గని మునియిట్లనియె. "అంగ.లా
రా! మీ రిట్లంగలార్చుటకు నేమి కారణంబు? మి మర్ల
మాటఁ జెందఁ జేయ సాహసించిన వాఁ డెవ్వఁడు. నేఁ గలుగ
మీ కీవిచారం బేల తేలెం" దని యాలేమల నెత్తి యశ్రు
బిందువులు దనపట్టంబునం దుడిచి యుపలాలించుచు నడిగిన
నా దివాకీర్తు లిట్లనిరి. "మునినాథా! యేమి చెప్పంగలా
దు. మే మీయారామంబునకుం జక్రవర్తి చంద్రుండగు హరి
శ్చంద్రుం దేతెంచె నని విని యాతని పాలికిం బోయి గాన
కౌశలంబుఁ జూసి యాహా యనిపించిన భూమీశుండును మెచ్చి
మీయిచ్ఛవచ్చిన వరంబు లిచ్చెదను. నేఁడు మేనవుడు వే
మాతని యాతపత్రంబు గోరితిమి. దాని కమ్మనుజపతి గోపించి
"యసర్వంబు. మీ కీపదార్థంబు వేఱొండు తాపంబు వాపు
దాని యాచింపుం" డనెను. అప్పుడమ్మహారాజు బాహాస
నూహాన్నంబు వేఁడిన మావరము పేరు దేవుఁడెఱుంగును. మమాత్రం
తండు వకార్వ్యనాదంబు సేసి కౌశికుకుమ్మారికల మనినను రా
తెంకంబుగా గాసి సేయ సమక్టిమాయదృష్టంబునపచివోకి.

శృంఖలంబులం దగిలి మీకు దిక్కుగల చోటఁ జెప్పుకొం డని
నిరసించి యాయాసపెట్టి వెడల నడిచె. ఆ యవమానంబునకు
నెంతయు స్వాంతంబునఁ బురపురఁ బొక్కి దేహంబుల పయి
నాసల వీడి మీతోడ విన్నవించి మఱి దేహపరిత్యాగంబు
సేయుద మని నిశ్చయించి నీవ మాకు దిక్కు గాన వచ్చితి
మని గోడుగోడున నేడ్చు నా పాలివాడచిగురాకుఁ గోండ్ల నుప
లాలించి " మీ రేమియు దుఃఖింపవలదు. ఆ రాజ్యమదాం
ధుని యంధత్వంబు వాపి పశ్చాత్తాపతప్తునింగాఁ జేసి మీకుం
బెండిలి సేసెద సుఖం బుండుం" డని మించిన కోపంబునఁ
గటకటం బడి కడిచేతం ద్రిప్పు జపమాలఁ బుడమిం బడవైచి
దిగ్గన లేచి భ్రూయుగంబు గలియ నాసాపుటంబుల స్వేదలంబు
లు వ్యాపింప నయనంబు లెఱ్ఱవడ నానన మంతయు ననంతా
రుణితం బ్బాని భీకరంబుగాఁగ నాము సిసింపచుఁడు కురంగంబు
పయికిఁ జెంగున లంఘించు సింగంబు భంగి నంగంబు వొంగ
వేఁడి నిట్టూర్పుల తోడం బయలు వెడలి త్రిలోకంబులు గజగజ
వడంకి యాటాడ నచ్చటి మునినికరంబులు సురనికరంబులు
హాహాకారంబులు సేయ మారుతజవంబునఁ, బ్రళయకాల
ఫాలాక్షఫాలానలంబు రూపంబు బూనెననఁ దిరిశూలంబుం
బోని దండంబు భుజాదండంబునం గీలించి యించుకయుం గరుణా
లేక క్రూరతరపాదఘట్టనంబుల దర్వీకరేంద్రుని సమస్తమస్త
కంబులకు నగ్గలం బగుబాధఁ గలిగించుచు నగ్గాధేయుండా
ధరాభారధారేయు సమీపంబునకుం బోవుచుండ దూరంబున

నుండి యాభూరమణుండును రమణియు రూక్షవీక్షణంబుల నిప్పు లొలుకు లోచనంబుల నాభీలం బగు నమ్మునివదనంబు నీక్షించి కడు వెఱపు నొంది యంగంబు వడవడ వడంక మోముదమ్ములు వెల్లవాఱ వలిచెమట దేహంబున వ్యాపింపఁ బులకితశరీరు లయి యతికష్టంబున నూర్పు లిడుచు తెప్పవడకుండఁ జూచుచు నంతరంగంబునం దెట్టు లయినఁ గౌశికుమూలంబున నేల యంతయుం బోవు నని జగ్గిలియు వివేకంబుఁ బూని తాను మానినియు నమ్మౌని కెదు రేగి యడుగులకు మడుఁగు లొగ్గుచు బహువిధంబులఁ బూజించి సాష్టాంగంబుగా నాతని చరణంబులం బడిన వడిం గడు బెడిదం బగు తన్నున నాభూవరుని మస్తకం బా మునినరుండు తన్నుటయుఁ దద్దయు వగచుచు ధైర్యంబు విడనాడక వివేకంబు వీడఁబుచ్చక మానవాధీశ్వరుం డిట్లనియె.

"మానినీలోత్తమా ! భవదీయమ్మౌనుల పదయుగళంబు మదీయ వజ్రమణిముఖోపల స్థగితకిరీటకలితమస్తకంబు నంటి యెంతయు నొచ్చినయది. నే నేమి యపరాధం బాచరించితిని దానిం జెప్పి మన్నింపవే" యని వేవిధంబుల వేఁడ నాపుడమిఱేడ ముని యెడల నెడ నెడ సేసి కరుణింపక పండ్లు పటపట గీఁటుచుఁ జటులవీక్షణంబుల నీక్షించి "నీమాయల మాటిక్షేపంబులు నా యెడం గట్టిపెట్టుము. ఈ వక్రవినయంబులు నాకడం బనికి రావు. ఒక్కపాదతలం బన నేల యంగం బంతయు నంతరంగంబునుం గూడ నీ కుటిలచేష్టితంబుల నొచ్చిన

యవి. నీ యట్టిమత్తుని కార్యంబుల నెవ్వరు నొవ్వకుందురు ? ఓరి యధమాధమా, మామకాశ్రమం బగు నీప్రదేశంబు మా యాన లేక చొచ్చి మమ్ముఁ జీరికిం గొనక బంగారువంటి నా యిత్త్రి గ్రిందుఁదనంబుగ నేసి, యివ్వనంబున బండ్లను రాలిచి కుసుమంబుల వాడం జేసి జంతునికరంబుల వేఁటాడి వేరు పురుగు రీతి నఖిలంబు ఖిలంబు సేసి కమలాకరంబులం గలంచి సర్వంబు వికాసహీనంబు జేసితివి. అంతం బోవక నాగాదిలిఖాఁతులు మాతంగకన్యక లిరువురు సురుచిరరూప రేఖాజితరతీదేవులు సంగీతపాండిత్యంబు సూపి యాచింప వచ్చిన వారి బాధించి యవమానించి పంపినాఁడవు. ఇంత కన్న నెక్కుడ్డౌ నపరాధం బెందయినం గలదె. నీపౌరుషంబు నారీరత్నంబుల యంద చూపుటకు తగినయది. కొఱవిం దల గోఁకికొంటివి. మామకశక్తి సంపన్నత నేఁడు చూచెదు గాక. ఎన్ని చేసినను జేతులు గట్టుకొని యిచ్చకంబు లాడుటకు నే వసిష్ఠుఁడను గాను జుమీ" యని కోపంబిను మడియుగుడు మగుడి.

"ఓరి రాజకులాధమా! నృపుఁడు లేరో! వేట రారో! మద
కూౄరాభీలమృగావళిం దునుమరో! ఘోరాటవు ల్లేవో నా
యాశ్రమంబుఁ గలంచి జంతుతతిమాయం జేసి యున్మత్తుఁ మా
కీరత్నంబులు వేఁడ వచ్చినను వారి న్నొంచినా వేమిరా"

యని యదల్చి హుమ్మని భీకర మ్మగు చపేటమ్మున నవ్విశ్వంభరాజాని నొవ్వం జేసినఁ గౌశికు రోషావేశంబు వీక్షించి యేమియుం దెలియక బెండువడి యున్న యన్నరపాలు

కుని గని యతని బోధింప నదియ సమయం బని నిశ్చయించి సత్యకీర్తి హరిశ్చంద్రుని తోడ నిట్లనియె.

« నరనాథాగ్రణీ! నీ విట్లు మిన్ను విఱిగి పయిం బడిన వడువున తాపడి యుండ నేల. ఆపద వచ్చినప్పుడు వివేకంబు విడువక ధైర్యం బూఁతగాఁ గొని స్వసామర్థ్యం బంతయు నాత్మరక్షణార్థం బుపయోగించు నది గాన నిన్నుం గాచికొనుము. ఈగాధేయు కోపం బలఫాలాక్షు నేత్రానలంబు కంటె నలవు మిగిలియుండు. సిద్ధసాధ్యగంధర్వకిన్నరాసు లీసంయమీంద్రు నామంబు వినిన మాత్రంబున సుపర్ణనామంబు వినిన యురగంబుల భంగి భయంపడుచుందురు. మన మన నెంత వారము. వేగంబ కారుణ్యం బుదయింప నీ వీవాచంయముని బ్రార్థించి యాత్మరక్షణంబు సేసికొనుము. శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్మను మాటం బూని యామౌనివిభుని పాదంబులం బడి నిన్నోమికొనుము. అను నమ్మహానీయు నాలాపామృతంబు సంజీవ గొని తెలివొంది యంజలి ఘటియించి దీనాననంబున గాత్ష్ణ్యంబువోడము పలుకుల నాయిఱ్ఱేఁడా మునిరాజున కిట్లనియె. « ఓసదయహృదయా! దయారసంబు చిలికి నన్నపరాధిం గావ గదవే. నీకుఁ గోపంబువచ్చినం గమలభవాదులయిన నీయెదుటనిలువ నోపరన నేనెంతటి వాఁడ నన్నేవిధి నయినం గాపాడఁదగు. వండయింటి కుందేటిని గూరగా వండఁ దగునె. శరణంబు వేఁడిన వాని రక్షింప కుపేక్షించుట మీవంటి మహాత్ముల ధర్మంబె. నాతప్పు లెల్ల

లోఁగొని సైరించి నన్ను నీ వానిఁగా జూడవే మునినాథా ” యని తానును దారయు సుతుండు నాగాధిసుతునిపాదపంకజంబులం బడి లేవ కున్నఁ గొంతకాలంబున కాసంయమిపంచాననుండు శాంతంబు వహించి వారిని లేవ నెత్తి దాక్షిణ్యంబు గనుపడు వచనంబుల బార్థివేంద్రున కిట్లనియె. “రాజోత్తమా! మాబోంట్లకుఁ గోపంబు తత్క్షణంబ పోవుం గాన నీదీనాలాపంబుల వలన నాహృదయంబు నీవలన సస్నేహం బయిన యది. నీయపరాధంబుల నెల్ల క్షమించితిని. నాచెప్పుదాని నొక్క కార్యంబు జేసి మన్మనఃప్రీతి గావింపుము మామకపుత్త్రికల నామాతంగకన్యకల సురుచిరసౌందర్యవిలాసవతుల నిరువురం బరిణయం బయి యౌవనవరంతబు భోగంబులం బొందుము. నిన్నెపుడును గనుమూయక గాచుచుండెదను. ఇది త్రికరణశుద్ధిగా నేఁ బలికినపలుకు నీ మనంబుఁ దెలియ నడిగితినని యనుకొనెదవు సుమీ” యని పల్క విశ్వామిత్రు చిత్రవాక్యంబుల నాకర్ణించి పిడుగు వడిన వానిం గొఱవిఁ గాలిచిన యట్లయిన నెంతయుం జింతించి “యిమ్ముని యేవిమో మాయలం బన్ని యాపదలం ద్రోయక యూరక పోవువాఁడు కాఁడు. నాకన్నకలఁకలం బనుభవింప వలదెయని యించుక వితర్కించి యామునిరాబారిం గని ధరాధినాధుం డిట్లనియె. “ఉత్తమక్షత్త్రియవంశంబున జనియించి చెప్పరాని కులంబువారిం బెండ్లియాడుటెట్లు? అదియుం గాక యే నేకపత్నీవ్రతుండను. ఇట్టి

నన్ను నీపనిఁ జేయు మని యేల యడిగెద" రని ధీరత మెయిఁ బలుకు నినకుల తిలకునింగని తపోధనుండిట్లనియె.

"రాజుల కెట్లయినను నరకలోకనివాసంబు దప్పదు. రాజ్యాంతే నరకం ధ్రువమ్ మ్మనుకోవిదులవచనంబు వృథయగునె గావున నాయనుమతి నాపలి వాడ పూవుఁబోండ్లం బెండ్లియాడి వివిధ సౌఖ్యంబులం బొందుము. ఎప్పుడో యేద్దియో ముందు దొరకు నను నాసఁ బ్రస్తుత సౌఖ్యంబులు నిరసించుట వెఱ్ఱి గాదె. మొయిలు నీరు నమ్మి భాండంబు జలంబుల నొలికిం బఱపుట వెంగలి విధంబు గాక వివేకిలోకంబున కర్హంబగు కార్యమె. సౌఖ్యం బంద నేరవు. ఇంక నయిన నీ దుర్బుద్ధులు గట్టి పెట్టి యనుమానము మాని మానస వసము సంతోష మగ్నాయమానంబు గాఁగనో మానవాధీశ నేఁజెప్పినమాటలం బాటింపుము. అట్లు గావించితేని నాహృదయంబు సదయం బగు. మదీయకారుణ్యంబు రక్ష యయి యనవరతంబు గాపాడు చుండ మామకలోకవిఖ్యాత సుందరాశ్రమంబున ననేక ప్రస వజాత సంజాత వాసనాగత భ్రమరామాలసంగీత మనోజ్ఞంబు లగు కాయమానంబుల వలనం బల్లవకల్పితానల్ప సౌఖ్యాకర తల్పంబులను, వివిధవర్ణ విభాసితవర్ణ ప్రకరకాంతి పూరమనో హర పర్ణశాలాంతర లతాంత శయ్యాతలంబులను దట్టోకనదీ నీరశీకర శీతలవాతూలాతి సంతోషకరమణి గణచికరాకర విశద కాసైకత ప్రదేశంబులను శాతకుంభ కుంభవిభా భాసిత ధారాగ్రతలంబులను జందనవసుంధరాధర సమాగతమంద

మారుత సంజనితామోదకర కృతకధరాధర శిఖరకందర బృందంబులను గతాగతచామీకరడోలికాసికాయంబులను శీతకరునమృతమయకిరణనికరంబు కరం బానందంబు గూర్చుచుండ నావిలాసినీలలామలం గలసి విహారంబు సలిపినం గలుగు సౌఖ్యం బొక్కపరి యనుభవించిన నింద్రపదవి నయినం దృణంబుగా నిరాకరింపవే. ఎట్టి క్షత్త్రియో గాని యిట్టి సౌఖ్యాస్పదం బగు బదవి నీకుం గావింతునని యెన్ని చెప్పిన నేదియో వ్యర్థవిచారంబు దెచ్చిపెట్టికొని వల దనెదవు. ఇట్లనల్పకాలం బీచంద్రవదలన తోడి పొందున నమందానందంబులం బొందిన బొంది తోడం గైలాసంబున కనేకాధ్వరంబులం జేయించి నిన్నుం బంపెద. మున్ను నీజనకున కట్టి పదంబు నేన గాదె ప్రాపింపం జేసితిం గాన నింక నయిన నీవెఱ్ఱిబుద్ధులు మాని కర్ణకలాపంబు లగు నాలాపంబుల నాకలాపికలాపకచ భారలం భరించెద నని పలికి నాహృదయంబు నందలి కోపం బాసరస వచన సుధారసధారలం జల్లార్చి నన్నుం గాచికొను" మని పలువిధంబుల నాప్త్రుండునుం బోలె బోధించు గాధినందనుసంగని ధరాధినాథుండు హేమాహార్యంబు కైవడిం దొలంగక ధైర్యం బవలంబించి సధర్మంబుగా నిట్లనియె.

"మునినాథా, మీశక్తి కేమి యాశ్చర్యము? అంబరం బందిన వాని పోడ వెంత యట్టు మీమాహాత్మ్యం బింతింతని యేర్పఱుపం దరంబె. అయిన నీ యల్పసౌఖ్యంబుల కాశించి శాశ్వతం బగు పరమపదంబునకు దూరుండ నగుదునె. కామం

బునం జేసిన పుణ్యకర్మంబునం గర్గం బుణ్యలోకప్రాప్తి యగుం గాని యనంతరంబ “క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి” యను ధర్మంబునం బుణ్యం బంతంబు నొందిన కొండనె నాతండు బుడమిం బడి పుణ్యపాపకర్మంబులం జేసి పోవుచు వచ్చుచు నుండు నయ్యలగతి నూర్ధ్వాధోలోకమధ్యలోకంబుల నిలుకడ లేక యుండునుగాని వానికి మోక్షంబు రా నేరదు. కామంబు జయించి బ్రహ్మార్పణాత్పరమతి యయి సుకృతంబులు సేయువాడు సంతతం బనంతం బగు బ్రహ్మానందంబు నొందు. అయ్యానందంబునం దానియం దంబుధిం జలకణంబు లట్లు సూక్ష్మంబు లయి యుండు దక్కటి యానందంబులను గామోపహతుండు గాని శ్రోత్రియుం డందును గాన మీవచనంబులంగీకృతంబులు గావు. “మీసాలమీది తేనియ” లీ భామాభోగంబులు వీనినమ్మ ధర్మంబు వీడి. ఘోరనరకంబునకుం బాలగుదురనె. “రాజ్యాంతే నరకంధ్రువ” మ్మని మీరు వచించితిరి. ఎఱుంగక సేసిన దోషంబునకు శిక్ష లేదు గదా ఎఱింగి మొఱింగి దా నఖండైశ్వర్యధుర్యుండ నని మదంబునం జేసిన దుష్కార్యంబులకు ఫలంబు నరకలోకనివాసంబు. గాక మొఱుంగమిం జేసిన యవి పాపంబు లగునె. అదిగాక మీరు పల్కినట్లు రాజ్యాంతంబున నరకంబు నిశ్చయం బయిన నది తెలిసియు నాబాధల వృద్ధిపఱచు దుష్కార్యంబులం జేయ వలయునె. కావున నీకుమారికల నామాతంగకన్యకల నేనొల్ల నీ వొసంగు “సశరీరస్వర్గసుఖంబును” నా కభిమతంబు గాదు.

శిష్టులు పూర్వంబు చేసిన సత్పథంబునం బోయెదఁ గాక పాల వంటి కులంబునకును ధర్మంబునకును దూరుండ నయి యీ మాలమగువల నేమని పరిణయం బయి యేమనువాఁడను! ఎన్ని విధంబులఁ జెప్పినను ధర్మంబు విడుచుటకు నామనం బొప్పదు. సకలసామ్రాజ్యం బయిన విడిచెదఁ గాక ధర్మంబు గంఠంబున బ్రాణంబు లున్నదనుక విడువనోపఁ" నని తెగువ మెయిం బలుకుచుండ, "తథాస్తు మా కంతియ చాలు. నీ విచ్చెద నన్న రాజ్యంబు మా కొసంగుము. ధరణిం బాలించి యనేక దినంబు లయ్యె. సప్తద్వీపంబులు నేలు వాంఛ యుదయించు చున్నది. ఎల్లి మామక శిష్యసంఘంబుఁ బంచెదఁ బట్టంబుఁ గట్టి నీముద్రియుంగరంబు వారలచేఁ బంపునది. నీవు సకల శ్రేయంబులం బొందుదువు. నీకుకీర్తి యాచంద్రతారార్కంబు నీ భువి వెలయుం గాక" యని దీవించుచుండ నయ్యినకులనాథుం డిట్లనియె.

"సకలసంయమిసంతాన శేఖరుండవయిన నీయిష్టంబు సేయుట కంటె నితరం బొక్కండు ఘనకార్యంబు గలదే. త్రైలోక్యాయిలాతలం బంతయు ననంతవైభవంబున నేలిన మీకు దీని కొసంగ నే నెంతటివాఁడను. మదీయ చిత్తశుద్ధి నెఱుఁగంగోరి మీ రిట్లంటిరి గాక యీ యనిమిష సుఖంబులు మీకేల. ఇట్టివి యననుభవనీయంబులని తలంచి గాదె మును పరిత్యజించితిరి. వాని మీరు నిక్కంబుగాఁ గోరెద రన్న నే నెట్లు నమ్మెడువాఁడను. మాటల వెంబడి నామనంబు విమల

బరికింప నిట్లంటిరిగాక యను నాతనిం గాంచి నవ్వుగాని నవ్వు నవ్వి యవ్విశ్వామిత్రుం డిట్లనియె. సత్యవ్రతుని సూనుండ వయిన నిన్ను సత్యసంధునింగా జగంబు లన్నియుం జేర్కొను. అట్టివాఁడ వీచతురతరాలాపంబులు వలుక నేమి యనవరంబు ఎట్లయినను దప్పించుకొందు నని డెందంబునం గోరెదవుగాఁ బోలు మనఃపూర్వకంబుగా నీయని దానంబుఁ బరిగ్రహింప నేనంత బేలనె. కాంకి నీరాజ్యంబు నీవ నిలిపికొనుము.'' అను చు నవమానించుడుఁ బలుకుచుండఁ జంద్రమతీదేవి హరిశ్చం ద్రునిం గాంచి ధీరత దోఁప వాక్పుణ్యంబున నిట్లనియె. ''నాథా! ఈగాథేయువలం దగిలితి మింక నేమియను నెటు వచ్చునో యందు వచనంబు మాని భూమండలం బంతయు దా నంబు సేయుము. పూర్వకాలంబునం దేలిన రాజులయం దొక్కం డయినఁ దనతోడ నీధరణిం గొంపోవం గలిగెనే. దశదానం బుల భూదానం బుత్తమం బని మనీషులు వలుకుదురు అధమ పాత్రంబున కిచ్చినదానంబు చవుటినేలం గురిసిన నీరధారంబోలె నిష్ఫలం బగును. సత్పాత్రంబు బిప్రుడు తావకతపోవిశేషంబున దొరకెంగావునఁ గొంకక యీసర్వసర్వంసహామండలం బఖండ తేజుండ వయి దానంబు సేయు'' మని తెంపునఁ దనమనంబున కనుకూలంబుగాఁ బలుకుఁ గులాంగన పలుకులు విని మెచ్చి ''యోహో యేటికి నొక్కరుం గోటికినొక్కరుం దీయక సతీపతులు ధర్మబుద్ధి గలిగి యుంట పూర్వజన్మసంస్కారంబు. అనుకూల కాంగనలం గలిగిన జనులకు నఖిలంబు సమకూరుట యబ్బురమా

# హరిశ్చంద్రచరిత్రము

"ఔ" యని గంగామంగళోదకంబుల హేమపాత్రంబునం దెప్పించి దేవబ్రాహ్మణమాన్యంబులు దక్కఁ దక్కిన సర్వోర్వీతలంబు నీశ్వరప్రీత్యర్థంబు వసుంధరాధీశ్వరుండు గాధేయునకు మహామహిమాఢ్యంగా ధార వోసె. తదుదకధారలం గలిసి సురలసుమవర్షంబులు గురిసె. దుందుభినినాదంబుల తోడ నశేషదేవతాస్తుతులును జెలంగె నప్పుడు మునివరుండు భూవరునిం గాంచి యెల్లిమామకాంతేవాసిగణంబు వచ్చునేఁ బోయివచ్చెద నని వీడ్కొని యాశ్రమంబునకుం జనియె.

అంత నయ్యనంతాకాంతుం డత్యంతం బగు సంతసంబునఁ బురంబునకుం బోవుచుండఁ గొంత దూరంబున నొక్కచక్కి నున్నత స్తంభంబు గాంచి దాని పయి నక్షరంబులు గాన నయినం దేరు డిగ్గి తత్సమీపంబున కేగి,

క. నిలునిలు మిచ్చట లోఁదర
వలదు మదాలోచనమున వారక యెపుడుం
బలుసుఖములు నీ వందెం
గల వటుగాన నటుపొమ్ము కర మనురక్తిన్.

అది చదివి దీనికి మూలం బేమి యయియుండ నోపు నని యుల్లమునఁ జింతించి యావైపున మార్గం బొండుగాంచి యా దారిం బోయి యొక్క విశాలవృక్షంబు నీక్షించె. ఆభూజంబు ఛాయ నొక్కపురుషుండు దనజనకునిం బోలువాఁడు గాననయిన నత్యద్భుతంబు నొంది యాభూజాని వానిఁ

ల్కారింపం గమకింపుడుఁ ''కుమారా నీకుసుఖంబగుఁగాక నీకును గాశికునకు నయిన సంవాదంబును దత్ఫలంబు నంతయు నెఱింగి దాన నీకిడుమలు పొడము గానఁ బుత్రవాత్సల్యంబున నే నూరకుండనోపక భవదీయ క్షేమంబుకొఱకిటువచ్చితిని. నీ వామహామునీంద్రునకుం గినుక యుదయించున ట్లలసేసి రాజ్యం బంతయుం బోకడ వెట్టి- కొంటివి. నీ యట్టివెడం గం దయినం గలఁడె. నీ వామాలెతల నుద్వాహం బయిన నేమి యుపద్రవంబు సంభవించు. కులంబు వోవు నని తలంచెదవే. కులం బన నేమి. దేహాత్మలయందెద్దానికిఁ గులంబు చెందియుండును. పంచభూతాత్మకం బయిన దేహంబున కది గలుగు టెట్లు. ఆత్మకంటివేని సర్వంబును దాన యయి వెలుంగు పరమాత్మ కాభేదం బెట్లు సిద్ధించు. ఆత్మకువినా సర్వంబును మిథ్య గదా. అయినచోఁ గులంబు మాత్ర మట్లు గాక యుండునే. అజామిళుఁడు కులంబునకు వెలి యయి మోక్షంబు నొందఁడే. ఇంత యేల, యేఁ గులంబు వీడియుం బుణ్యలోకంబులొందితిని గాదె. కానఁ గానితంపులు మాని యామానినులం గైకొని నన్ను నమ్మహానందంబు దేలింపుము. అద్రినకు సమ్మతంబు గాదేని మాటల సందున రాజ్యంబు నే నిచ్చెద నంటిని గాని మనఃపూర్వకంబుగా నీకు ప్రదానంబు సేయుట లే దని యీతని తోడం జెప్పి కొంబు గొనుము. ఆత్మరక్షణార్థంబు బొంకవచ్చు నని

ద్దలు పలుకుదురు. తలంచ్చి చూడ నిది బొంకుగాఁడ
గాదు. కావున సత్వరంబుగం దిరిగి యమ్మునియాశ్ర
మంబునకుంబోయి భూమిని వేఁడి పడసి సుఖివి గమ్ము. దాన
నాకెంతయుఁ జిత్తంబు సంతోషించు. అట్లు గాక నీ వఖి
లంబు గోల్పోయి బిచ్చగాని రీతిం ద్రిమ్మరుచుండ నే నెట్లు
చూచు వాఁడ నా యభిమతంబు వేగంబ సేయు మని" వేగి
రించు నాతనిం గాంచ్చి "యీతఁడు సూడ సూడయి యున్న
వాఁడు. రూపంబుఁ జూచినం బరమాప్తుం డయి కన్పట్టు
చున్న వాఁడు. నే నేమి చేయుదు నని చాల నాలోచించి నిజం
బుగ నీతండు నాతండ్రియే యయిన నిట్టి విరుద్ధవాక్యంబులం
బలికి దురాలోచనంబులం బోధింపఁడు. వీఁడు కపటమాయా
మయుండగు నరాధముండు గానోపు" నని నిశ్చయించి "నీ
వెవ్వండవు. నాకిట్టి మనోబ్బాధ సేయం బూనినాఁడవు. సూర్యవం
శోద్భవుండగు సత్యవ్రతున కిట్టి నీచవాక్యములు నోర వెడ
లునే. నిన్ను నిజంబుగా నెఱింగింపు మసత్యంబుఁ బల్కితయేని
[illegible]గ్ని కిప్పుడ యాహుతిం జేసెద" నని రూక్షవీక్షణం
బుల నీక్షించుటయు నాతం "డోరీ గురుద్రోహి జనకుండు
వచ్చి నిన్ను బోధించుచుండ నీవు నాకుం దండ్రివే యని
యదల్చి చంపం బూనెదవు. నీకన్న దురాత్ముం డెందయినం
గలఁడె చేటుకాలంబు దాపయ్యెం గాఁబోలు లేకున్నం దండ్రి
నిట్లనుచితంబు లాడి సమయం జేయ సమకట్టుదువే దుర
త్మా" యని నాటం దిట్టు నాజనునిం గాంచి యిది య

ద్రిశంకువరంబు గాఁబోలు దీనివలన నే నేలీల వెడలు వాఁడ
నని విచారించి యీశ్వరుం దలంచి "దైవమా నేఁ దప్పు
ద్రోవం బోయిన సైరింపు మని వాలు నోఁట వెటికి వానిఁ
జంపఁ బోవుటయు వాఁడును "వలదు వలదిదిధర్మంబుగాదుర
యేల రౌరవాది నరకంబులకుం బాలగుదు" వనియెన్నివిధం
బులం జెప్పిన మాన కామానవాధీశుండు కరంబునసిదళు
క్కనుచుండ నెత్తి వాని నెత్తి వ్రేయఁబోనాకపటత్రిశంకుం
డొక్క మునిరూపంబుధరించినయ్యినకులనాథుండుగత్తిం బడ
వైచి నమస్కరించి "ఋషితిలకా నీవీరూపబునొందగారణం
బేమి." అనవుడు "కృపాలా యేనొక్క మహర్షి శిష్యుండను.
గురుతోఁ జేయని పారచింతనంబుఁ జేసితినని చెప్పినం దెలిసి
దానవుండుగా శపించె. అట్లు శపించుటయు బెగ్గిలి "మౌని
నాథా నే నెట్లు పాలసుదిండినయి దుష్కార్యంబులకొడిగట్టి
మూర్ఖుండనయి యుండు వాఁడ నాయందనుగ్రహింపు" మని
వేఁడిన "నీవు హరిశ్చంద్రరాజచంద్రుని రాజ్యంబు దానంబుఁ
జేసి దారిం బోవుచుండఁ ద్రిశంకువేషంబువవిశ్వామిత్ర ప్రేరి
తుండవయి మోసపుచ్చఁదలఁగితువు. ఆతండు నీకులోనుగాక
నిన్నుఁ జంపంగమకించు, ఆసత్యసంధు కరవాలమహారుతంబు
సోఁకిన తోడనె నీయసత్యదోషంబు వాసి పోవునప్పుడ నీకు
శాపమోక్షంబగునని యానతిచ్చె అట్ల నీ యనుగ్రహంబు
జేసి భూసురుండ నయితి నీకు సర్వశుభంబు లగుఁగాక
[illegible] పాలికిం బోయెద" నని వీడ్కొనిచనె. ఆతండు చను

# హరిశ్చంద్రచరిత్రము

హరిశ్చంద్రుండును రథంబు [illegible] తాపసునకు [illegible] క్రోధ[illegible]ంబు నేసియా[illegible] చారంబు నిజసచివులకు చెప్పుచు వారలు దీర్చికులాయంబులకు నతికోలాహలంబునం బాఱు పతంగ వంశపుంగవంబులతోడ నాపతంగ వంశపుంగవుండును రాజధానిం జేరి యంతఃపురంబున కరిగె. అప్పుడు తమోరాజి నందలి యనురాగంబున నా నాస్థాయం బంతయు సంధ్యారాగంబున నరుణం బయి మనోహరం బయ్యె. తదనంతరం బాభూకాంతుని యశోరాశినా జంద్రుం డతిప్రకాశంబుగ భాసిల్లె. మఱునాఁడు రేపకడ వైతాళిక ప్రబోధనంబులం బడక లేచి యాపుడమియొడయఁడు గడు ముదంబునఁ బ్రొద్దు గడంగూడి మంతనంబున నుండం బ్రతీహారి యొక్కరుండు సమయంబు వేచి యేతెంచి,, దేవా! విశ్వామిత్రమహర్షి దేవర సందర్శనంబుఁ గోరి విచ్చేసెనని విన్నవింప లోనికిం గొనిరమ్మని యమ్మనుజాధీశుఁ డాజ్ఞ యొసంగె నను టయుం గౌశికుం డేలతా నేవచ్చె. హరిశ్చంద్రున కాతనికి నేమి సంవాదంబు గలిగె. దాన నేమి పుట్టె తరువాతి వృత్తాంతం [illegible]తయు నెంతయు వినవలతు, నాయందలి ప్రసాదంబున నానతీవే యని యాకర్ణనకౌతూహలి యయి కౌంతేయుం డడుగుటయు

క. లోకముల నెల్లఁ గరుణా
లోకనమునఁ గాచుచుఁ దను, లోకనివాసుల్
ప్రాకటముగఁ దెలియంగా
నీ కక్షలంబున వెలుంగు నిఖిలాధిపతీ.